# అంకితము

నా ప్రియజనకుడగు

కీర్తిశేషులైన

మన్నేపల్లి - వేంకటాచలం పంతులుగారికి.

# వి ష య సూ చి క.



## పదియన అధ్యాయము.



## పదునొకండన అధ్యాయము.



## పండ్రెండవ అధ్యాయము.



## పదమూడవ అధ్యాయము.



## పదునాల్గవ అధ్యాయము.



## పదునైదవ అధ్యాయము



## పదునారవ అధ్యాయము



## పదునేడవ అధ్యాయము.





# విన్నపము

ఆంధ్రదేశీయులెల్లరు తమ్ముపాలించు చక్రవర్తి గారియొక్క జీవితచరిత్రమును తెలిసికొనుట అత్యావశ్యకమని తలంచి నేనీగ్రంథమును రచియింపబూనుకొంటిని. నేను సంపాదించగలిగిన విషయములనెల్ల వ్రాసిన గ్రంథబాహుళ్యమగునని, అనేకవిషయముల వదలి క్లుప్తముగ వ్రాయ యత్నించితిని. నాకుగల భాషాజ్ఞానమత్యల్పమగుటచేతను, గ్రంథరచనకిదియే ప్రథమ యత్నమగుటవలనను, ఇందనేక దోషము లుండవచ్చును. వాటిని చదువరులు మన్నించి, దయార్ద్రహృదయులై నాకుందెలిపిన, వందనపూర్వకముగ వాటింగైకొని, ద్వితీయముద్రణము తటస్థించునెడల, తప్పుల సవరించుకొందును.

ఈ గ్రంథరచనయందును ముద్రణమునందును నాకు సాయమొనర్చిన మదరాసు చింతాద్రిపేట లోని హెచ్. వి. కృష్ణ అండు కంపెనీవారికి నేను మిక్కిలి కృతజ్ఞుడను.

నెల్లూరు.
1—2—1914.

మ. రామకృష్ణరావు.

శ్రీ

# పంచమ జార్జి చక్రవర్తి జీవితము

## మొదటి అధ్యాయము

### వంశావళి

ప్రకృతము మన హిందూదేశమును పాలన చేయు ప్రభువు శ్రీపంచమజార్జి చక్రవర్తి. వీరే ఇంగ్లాండు, స్కాట్లాండు, ఐర్లాండు మున్నగు బ్రిటిష్ద్వీపములకునురాజు. వీరికిముందు జార్జి అను పేరుగల నలుగురురాజులు ఇంగ్లాండు దేశమునకు ప్రభువులుగనుండియుండుటచే వీరు ఐదవజార్జియను పేరుతో రాజ్యసింహాసనారూఢులైరి. మొదటి నలుగురు జార్జిరాజులపరిపాలనలు ప్రజానురంజకములుగ నుండకపోవుటచేతను వారిలో కొందరు మిక్కిలి క్రూరముగను దూష్యముగను పరిపాలన చేసియుండుటచేతను, జార్జియనుపేరు శుభదాయకముకాదని, మనచక్రవర్తికి జార్జియనుపేరిడినపుడు

కొందరు ఆంగ్లేయప్రజలు సందేహపడిరి. కాని పంచమజార్జి చక్రవర్తివలన జార్జియనుపేరునకుగల అప్రతిష్టయంతయు మాసిపోయి సందేహించిన ప్రజల యూహలు నిర్హేతుకములై పేరునందేమియు లేదనియు ఒకమనుజుని సుగుణములుగాని దుర్గుణములుగాని బయలుపడుటకు కారణములువేరనియు జగద్విదితమయ్యెను.

ఇదివరకు పరిపాలనజేసిన నలుగురు జార్జిరాజులలో మొదటిజార్జిరాజు 1714 - వ సంవత్సరమున రాజ్యాధిపతియై 13 సంవత్సరములు రాజ్యపాలన జేసెను. అతడు జర్మనీదేశమందు జననమందినవాడగుటచే అతనికి ఆంగ్లేయభాషగాని ఆంగ్లేయ రాజ్యవ్యవహారములుగాని బొత్తిగా దెలియవు. ఆ కాలమున రాజులు సహితము దుర్మార్గప్రవృత్తుల యందు ప్రవేశము మిక్కుటముగాగలవారై పరువు ప్రతిష్టలులేకజారశిఖామణులై తిరుగుచుండెడివారు. కాబట్టి ఆకాలస్వభావమునకు నామొదటి జార్జియు అధీనుడై యుండెను. 'యథారాజా తథాప్రజా' యను లోకోక్తిననుసరించి ప్రజలస్థితియు నట్లేయుం

డెను. కాని ఆకాలపుమంత్రి సత్తములును కవిశిఖా మణులును సద్వర్తనులై వారిసత్ప్రవర్తనలవలన లోకులకు మార్గదర్శకులుగ నుండి దుర్మార్గముల కొంతవరకు తగ్గించుటకు శ్రమపడుచుండిరి. మొదటిజార్జిరాజునకాంగ్లేయభాషయు ఆచారములును తెలియక పోవుటచే ఆంగ్లేయ రాజ్య వ్యవహారములయం దిచ్ఛలేక పరిపాలనాభారమంతయు మంత్రులకువదలి తానుభోగానుభవమున కాలము గడపుచుండెను. అట్లతడు 1727-వ సంవత్సరము వరకు పాలనచేసి మృతినొందెను. అతని కుమారుడు రెండవజార్జిరాజు 1727 - వ సంవత్సరమున రాజ్యాధిపతియై 33 సంవత్సరములు రాజ్యపాలన చేసెను. అతని పరిపాలనయు తండ్రిగారిపాలన వలెనేయుండెను; అతనికిని ఆంగ్లేయభాష తెలియదు. దుర్గుణములయందును తండ్రికి తీసిపోవు వాడుకాడు. అయితే అతని పాలనయందు కొన్ని యుద్ధములు జరుగగా కొంతశ్రమపుచ్చుకొని ఆంగ్లేయప్రజల యభిమానమునకు పాత్రుడయ్యెను. అతని తదనంతరము అతనిమనుమడు మూడవ

జార్జిరాజు 1760 - వ సంవత్సరమున సింహాసనా రూఢుడయ్యెను. మొదటి నలుగురు జార్జిరాజు లలో మూడవజార్జిరాజు పరిపాలన కొంచెము మేలుగానుండెను. ఆయన ఇంగ్లాండులో బుట్టి పెరిగినందువలన ఆంగ్లేయరాజ్యమందును అచ్చటి వేషభాషలయందును అతని కభిమానముగలదు. కాబట్టి రాజ్యాంగవ్యవహారములయందు కొంచెము శ్రద్ధగలిగి పనిచేయుచుండెను. అతడు తనపూర్వీ కులవలెగాక ఇంచుక సద్వర్తనముకలవాడు. 1810 వ సంవత్సరమువరకు అతడు స్వాయముగా పాలన జేయుచుండెనుగాని ఆవలమతిచెడి రాజ్యభారమును తన కుమారునియందునిచి 1820 వ సంవత్సరమున మృతినొందెను.

ఆయనకుమారుడు నాల్గవజార్జిరాజు 1820-వ సంవత్సరము మొదలు 1830-వ సంవత్సరమువరకు తనపితామహ ప్రపితామహులవలెనే దుర్మార్గవర్త నుడై చరించుచు తనతండ్రిపేరును చెడగొట్టెను. ఈ నలుగురు జార్జిరాజులపరిపాలన అంత్యముకాగా ఆంగ్లేయరాజ్య దురదృష్టమును అంత్యమై తదాదిగ

కాలక్రమమున ఆంగ్లేయరాజ్యము సకలవిధముల అభివృద్ధిగాంచెను. నాల్గవజార్జి రాజునకు సంతానములేకపోవుటచే అతని జ్యేష్ఠసోదరుడగు నాల్గవ విలియంరాజు రాజ్యాధిపతియై 1837 - వ సంవత్సరమువరకు జీవించియుండెను. అతని తదనంతరము అతని అన్నగారగు కెంటు ప్రభువుగారి కుమారిత జగద్విఖ్యాత కీర్తివహించిన శ్రీమద్విక్టోరియామహారాణిగారు 1837-వ సంవత్సరము మొదలు 1901-వ

సంవత్సరమువరకు అవిచ్ఛిన్నముగను ప్రజానురంజకముగను 64 సంవత్సరములు రాజ్యపాలనంబొనర్చి 1901-వ సంవత్సరము జనవరి తే 22 దిన పరలోకమునుబొందెను. అంతట నాయమ జ్యేష్ఠతనయుండగు శ్రీ సప్తమ ఎడ్వర్డుచక్రవర్తి పట్టాభిషిక్తుడై 1910-వ సంవత్సరమువరకు, స్వల్పకాలమే, రాజ్యపరిపాలనం బొనర్చినను మిక్కిలి మేధావంతుడయి శ్రేయోదాయకముగను, సమ్మోదకరముగను పరిపాలనజేసి పరలోకగతుడయ్యె. అంత వారిజ్యేష్ఠకుమారుడగు జార్జిరాజు పంచమజార్జియనుపేరుతో సింహాసనారూఢులైరి. ఈ నృపచంద్రుని పట్టాభిషేక

మహోత్సవమే 1911 - వ సంవత్సరము డిసంబరు నెల 12 - వ తేదిన ఇంద్రప్రస్థనగరమని మున్ను ప్రఖ్యాతి వహించిన ఢిల్లీ నగరమున మహావైభవముతో జరిగినదని చదువరులకెల్లరకు దెలిసినదియె.



# రెండవ అధ్యాయము

## జననము, బాల్యదశ.

శ్రీ పంచమజార్జి చక్రవర్తి 1865 - వ సంవత్సరము జూన్ నెల 3-వ తేది ఉదయము 1 గంట 18 నిమిషములకు జననమొందినట్లు, ఆస్థానజ్యోతిష్కులచే ప్రచురింపబడిన సర్కారు హుకుంవలన తెలియుచున్నది. శ్రీవారు సప్తమ ఎడ్వర్డుచక్రవర్తిగారికిని అలెగ్జాండ్రా మహారాణిగారికిని జనించిన ద్వితీయపుత్రులు. రాజజ్యోతిష్కులు కొందరు జార్జి రాకుమారుని జాతకమును పరిశీలించి జన్మకాలపు గ్రహస్థానబలిమినిబట్టి వారు ఆంగ్లేయరాజ్యమునకు తప్పక అధిపతియగుదురని వచించిరిగాని, సామాన్య సందర్భములలో రాజ్యాధిపతి గావలసినవారు రాజుగారి జ్యేష్ఠకుమారుడు ప్రిన్సువిక్టరుగారై యుండగా ప్రిన్సుజార్జి రాజగునని జ్యోతిష్కులు వచించుట కొందరికి ఆశ్చర్యముగానుండెను. కొందరు, జ్యోతిషమున విశ్వాసము లేనివారు, నమ్మకపోయిరి. ముందుజరుగబోవుసంగతి ఇదమిద్ధమని చెప్ప నేరికి

శక్యము? "స్త్రియాశ్చరిత్రం పురుషస్యభాగ్యం । దేవా నజానంతి కుతోమనుష్యాః" అను సంస్కృత లోకోక్తి ప్రకారము ఆడువారినడవడికయును మగ వారియదృష్టమును దేవతలె ఎరుగనప్పుడు మనుష్యు లెట్లెరుగుదురు? అనగా నీరెండు విషయములలో నిజమునుకనుగొనుట మిక్కిలిదుష్కరము. విధాత్ర శాసనమెట్లో యటులనె జరిగితీరును.

జార్జి రాకుమారుని తెలివి తేటలును జన్మమాదిగ మిక్కిలి శ్లాఘనీయములుగానుండి జ్యోతిష్కుల వచనములకు సరిపోవుచుండెను. శ్రీవారినామకరణ సమయమున వారికి జార్జి ఫ్రెడరిక్ అర్నెస్టు ఆల్బర్టు అని పేరిడిరి వారి తల్లిగారగు అలెగ్జాండ్రా మహా రాణిగారిప్రక్కన ఆయమ పూర్వీకులు నావికా యుద్ధముల మిక్కిలి యోధవీరులై పరాక్రమశాలు రని వన్నె కెక్కి బ్రిటిషుద్వీపముల చరిత్రలో ఉన్నత స్థానము నాక్రమించియున్నారు. అట్టిసంతతికి సంబం ధించినవాడగు మనజార్జిరాజు సహితము బాల్యము నుండి నావికావిద్యయందు శిక్షనొంది నౌకాశాస్త్ర మున గొప్పనిపుణుడని ప్రఖ్యాతి జెందుటయు వారి

వంశముయొక్క ప్రఖ్యాతికి సమంజసముగనున్నది. జార్జి రాకొమరుని బాల్యముననే నౌకావిద్య నేర్చు కొనుటకై పంపవలెనని వారితండ్రిగారు తీర్మానించిరి. అదివిని ఆంగ్లేయప్రజలు కొందరు అయిష్టమును గనపరచిరి. రాజకుమారుని పాఠశాలలకుపంపి సామాన్యవిద్యయందు నిపుణులుగ జేయుటమంచిదియని కొందరు ప్రజ లభిప్రాయపడిరి. కాని తండ్రిగారు తనకుమారులు సామాన్యజనులతో కూడి తిరుగుచు బాల్యమునుండియు సామాన్యజనుల కష్టనిష్ఠూరములను చక్కగా దెలిసికొనుచు ఎట్టిశ్రమలకైన నోర్చుకొనునట్టి శాంతస్వభావమునుపొంది, దేశముయొక్కయు బ్రజలయొక్కయు సంరక్షణార్థము మిక్కిలి ఆవశ్యకమైన నావికాసైనిక విద్యయందు సామాన్యజనులతో బాటు వారును శిక్షనొందవలయునని అభిప్రాయముగలవారైరి. కాబట్టి ప్రజలు, తండ్రిగారివిషయమున గొప్ప పొరబాటుచేయుచున్నారని, అభిప్రాయపడినను ఎడ్వర్డుగా రా యభిప్రాయములను లక్ష్యపెట్టక, ప్రజాస్వాతంత్ర్యముగల దేశములకు ప్రభువులగువారికి కావలసిన సుగు

ణము లలవడుటకు తానిశ్చయించుకొనినమార్గమే మంచిదని కృతనిశ్చయులై తమకుమారుల నిరువురను నావికావిద్య నేర్చుకొనుటకే పంపతీర్మానించుకొనిరి. మరియు జార్జిరాకుమారునికి నావికావ్యాపారమునే వృత్తిగా జేయుటకును పెద్దకొమారుడైన విక్టరురాకొమారుని రాజ్యాధిపత్యమున కర్హునిగ జేయుటకును దలంచిరి. జార్జిరాకొమారునికి ప్రథమమున విద్యాభ్యాసము ప్రారంభించినపుడునాలుగు సంవత్సరములవయస్సు. అపుడు వారి ఉపాధ్యాయులు రెవరెండ్ జాన్ నీల్ డాల్టన్ దొరవారు. బాల్యమునుండియు జార్జిరాకొమారుడు మిక్కిలి చురుకుదనముగల బాలుడని పేరొందినవాడు. మరియు తనస్నేహితులనందరిని నవ్వించుచు మృదుమధురవచనంబులచే వారికానందముకలుగ జేయుచు వారిచే మిక్కిలి ప్రేమింపబడుచుండెడివాడు. సాధారణముగ చురుకగు బాలురవలెనే జార్జిరాకుమారుడు తన బాల్యచేష్టలచే తన తల్లి దండ్రులను పాఠశాలయందలి యుపాధ్యాయులను సంతోషపెట్టుచుండెడివాడు. ఇట్లాబాలుడు దినదినప్రవర్ధ

మాను డగుచు తనముద్దుపల్కులచే నంతఃపురవాసులకానందము కలుగజేయుచుండుకాలమున ఒక ఆపదసంభవించి రాచకుటుంబమును కొంతకాలము దుఃఖముతోనింపెను. 1871 - 72 సంవత్సరములలో వారి తండ్రిగారికి విషజ్వరము తగిలెను. తండ్రిగారు కొన్ని దినములు దేహామే తెలియక మిక్కిలి బాధనొందుచుండిరి. వారు జీవింపరని సహా ప్రజలకును రాచకుటుంబమునకును భీతావహామయ్యెను. ఇట్లాజ్వరము నవంబరునెల మొదలు ఫిబ్రవరివరకును బాధించెను. ఆవల పరమేశ్వరుని కృపవలన జ్వరమునిలిచి తండ్రిగారిదేహాము స్వస్థత నొందెను జార్జి రాకుమారునికి 12 సంవత్సరముల ప్రాయమురాగానే, అతడు తల్లిదండ్రులను వదలి డార్టుమత్ రేవు పట్టణమునకు సమీపములోనున్న బ్రిటానియా అను ఓడలో నావికావిద్యనేర్చుకొనుటకై ప్రయాణమయ్యెను. వారి జ్యేష్ఠసోదరుఁడు ప్రిన్సు విక్టరుగారికి అపుడు పదునాల్గు వత్సరముల వయస్సు. వారును తమ్మునివెంట నావికావిద్యనేర్చుకొనుటకై పంపబడిరి.

---

# మూడవ అధ్యాయము

బ్రిటానియా నావయందు శిక్ష

బ్రిటానియా అను పోగమోడలో బాలురు నావికావిద్యయందు శిక్షనొందుటకు తగిన యేర్పాటులుచేయబడియున్నవి. ఓడలమీద గొప్పయుద్యోగములలో నుండువారి బాలురకు ఆయాయుద్యోగములకుతర్ఫీతుచేయుటకై అక్కడక్కడ పాఠశాలలు స్థాపింపబడియున్నవి. అట్టి పాఠశాలయొకటి ఈ బ్రిటానియా అనునావయందునుగలదు. అక్కడనే జార్జి రాకొమారుడును విక్టరు రాకొమారుడును రెండు సంవత్సరములు విద్య నేర్చుకొనుచుండిరి. సామాన్యజనుల బాలురతో పాటు రాచబిడ్డలును పనిచేయుచు తాము అన్యులకంటె యెక్కువ సౌకర్యములనాసింపక సామాన్యజనులవలెనే కాలము గడపుచుండిరి. ఇతరబాలురకంటె వారు ఎక్కువ కాలము విద్య నేర్చుకొనవలసియుండెను. నావికా విద్యయందు అందరుబాలురతో పాటు కొన్ని పాఠములలో శిక్షనొందినతరువాత, అన్యభాషలయందు

ను, ఇతర విద్యలయందును, కొంతకాలము ప్రతిదినము వారు ప్రత్యేకముగా శిక్షనొందుచుండిరి. కాబట్టి వారికి ఇతరులకంటె కఠినమైన శిక్షయే కాని రాచబిడ్డలని సులభముగా వారిని వదలరైరి. అక్కడ శిక్షనొందు బాలురందరిలో జార్జి రాకొమారుడే మిక్కిలి చిన్నవాడగుటచే వారిని బాలురందరు 'స్ప్రాట్' అను మారుపేరుతో పిలుచుచుండెడి. వారు. అచ్చటి దినచర్య యేమన, బాలురందరు ఉదయమున ఆరున్నర గంటకులేచి స్నానముచేసి, ఉడుపుల ధరించుకొని, అరగంటసేపు డ్రిల్లుచేసి ఆవల ప్రాతఃకాల భోజనము చేయుదురు. అంతట 8-45 గంటల మొదలు 12-గంటలవరకు పాఠములు చదువుదురు. మధ్యాహ్న భోజనమైన పిదప నొకగంట కాలము షచారుచేసి రెండుగంటలకు పఠనమందిరమునకువచ్చి నాలుగు వరకచ్చట పాఠములు చదువుదురు. ఆవల రెండుగంటలు ఆటలయందుగడపి, 7 గంటలకు రాత్రిభోజనముచేసి, కొంతకాలము చదువుకొని శయనింతురు. ఈవిధముగనే ఆరాచబిడ్డలును వారి విద్యాకాలమును గడుపుచుండిరి.

జార్జి రాకొమారుడు తనపాఠములను చక్కగవల్లించుచు ఉపాధ్యాయులకు వినయ విధేయుడై వారి ఆజ్ఞనుమీరక పరీక్షలలో ఘనముగా జయప్రదములగు ఉపాధ్యాయులచే బహుమతులం జెందుచుండిరి.

జార్జిరాకొమారుడు చనువునందెంత చురుకుదనము గనబరచుచుండెనో, పోకిరి తనమునందును అంత ప్రఖ్యాతిగాంచుచుండెనని అతని బాల్యచేష్టలనుగురించిన కొన్ని కథలజెప్పబడియున్నది. ఈవిధమైన కథలు సాధారణముగ ప్రతిమహాపురుషుని జీవితమందును గలవు. బాల్యమున సాధారణముగ చురుకుదనముగల బాలునకుండు ఉత్సాహమును శక్తియును అనేకవిధముల బయలుపడుచుండును. అవి కొన్ని బాల్యచేష్టలుగను కొంటెతనముగను పరిణమించు చుండును. చురకుదనములేని బాలుడు మొద్దువలెనుండి తనయందుత్సాహమేమియు లేకుండుటచే బాల్యచేష్టలు లేకయుండును. బాల్యమున కొంటెతనముచే ప్రసిద్ధిగాంచినవారు పెద్దయగుకాలదిని ఆకొంటెతనమును మాని మిక్కిలి అణకువగలవారుగను తేజోవంతులుగను ప్రఖ్యాతినొందుట

## మూడవ అధ్యాయము

మన మనేకుల జీవితచరిత్రలయందు గమనించుచు న్నాము. జార్జిరా కొమారునిగూర్చి చెప్పబడినకథ లలో నొకదానిని మాత్రమిందు పేర్కొనెదము. తన యుపాధ్యాయు డొకడు పగలంతయు గష్టపడి పనిచేసి విశ్రాంతిబొందనెంచి రాత్రిశయనించుటకై పడకపైబరుండగా, నాప్రక్కక్రిందముండ్లు వరుసగా చేర్చబడియుండెను. అదిచూచి యుపాధ్యాయుడు కోపోద్దీపితుడై ఈ దుర్మార్గకృత్య మొనర్చిన శుంఠ ఎవరో కనుగొనవలయునని విచారించెను. జాగ్ర త్తగావిచారించినమీద నాకార్యకర్త ఫలానివాం డని తెలియగా, శిక్షతప్పదని ప్రిన్సుజార్జికి తెలిసి తానే యీకార్యముచేసితినని ఒప్పుకొనెను. రాచ బిడ్డడని తన్నుమన్నింతురని తొలుత భావించెనే మోగాని యట్లుజరుగుట యసంభవమని తెలిసికొ నెను. ఆ పోకిరితనమునకు ఒక వారమురోజు లితర విద్యార్థులతో నాతనిచేరనీయక, నొంటరిగానునిచి విశేషపాఠముల జదువునట్లు శిక్షవిధించిరి. ప్రిన్సు జార్జియొక్క చేష్టలచే తోడిబాలురు బహుసంతో షముగానుండి వానిని అభినందించుచుండిరి. ఇవ్విధ

మున బ్రిటానియా నావలో రెండు సంవత్సరములు విద్యాభ్యాసమునొంది 1879-వ సంవత్సరము జులై నెలలో ఆస్థలమును వదలి ఆగస్టునెలలో బచాంటి యను నావయందు ప్రవేశించిరి.



# నాల్గవ అధ్యాయము



## బఛాంటినావలో ప్రథమసంచారము

బఛాంటినావ యొకచిన్న యుద్ధనావ. దీనియందు యుద్ధరంగమున కవసరమగు సౌకర్యము లన్నియు నేర్పరచబడియున్నవి. ఆరాచబిడ్డలు ప్రథమమున నావికావిద్య నందవలయునని నిశ్చయించుకొనుట లో వారితండ్రిగారి ముఖ్యాభిప్రాయము ఆబాలురు విధేయత, అడకువ, నీతి, చురుకుదనము మొదలగు సుగుణముల నాయోడలయందు పొందవలయునని యే. యుద్ధనావలలో నుద్యోగముననున్న గొప్ప యుద్యోగస్థుడు గాని చిన్న యుద్యోగస్థుడు గాని వాడువాడు నిర్వహింపవలసిన విధులను తప్పక ఆయాకాలమున నిర్వహింపవలయును; ప్రతివానికిని జవాబుదారిగల పనియొకటియుండును. కాబట్టివానికి విధేయతమున్నగు సుగుణరాజములువాడుకయై నైజ గుణములుగా వానియందు పరిణమించుచుండును. అట్టి సందర్భములలో రాచబిడ్డలును అట్టిశిక్షనే పొందుచుండినందువలన వారికిని ఆసుగుణములు పట్టు

వడి, దినదినాభివృద్ధి యగుకొలదిని వారిజీవితమున నాసుగుణము లెంతయు వన్నెకెక్కెను. మరియు నీయుద్ధనావలలో సంచారము చేయుటవలన వీరు వివిధదేశములకువెళ్లి వారి ఆచారములను వ్యవహారములను గమనించుచు, తమరాజ్యమునకు విరోధులగువారితో సరస సంభాషణములాడి వారిని స్నేహితులనుగా జేసికొనుచు, తమప్రజలతో కలసి మెలసియుండి, వారిరాజభక్తిని ఆదరణమును ద్విగుణముచేయుచు, బహుదేశ సంచారము వలన మనోవికాసముగాంచుచు, సర్వవిధముల తమ సంచారమును సార్థకముగ జేసికొనిరి.

ఆరాచబిడ్డలిరువురును మిడ్‌షిప్‌మెన్‌అను నావికోద్యోగపదవి యందుండినను రాచబిడ్డలని వారిని ప్రత్యేక భావముతో చూడక సామాన్యులైనవారి సహచరులవలెనే వారిని గూడచూచుచుండిరి. వారి వంతులువచ్చినపుడువారుఓడలవద్దకావలియుందురు. నావికావిద్య అస్త్రవిద్య గణితవిద్య ఇతరబాలురవలెనే వారును నేర్చుకొనుచుండిరి. మరియు ఫ్రెంచి భాషలోసహా పాఠముల నందుచుండిరి. ఇతరబాలు

## నాల్గవ అధ్యాయము

రకమును వారికిని గలభేదము వారికి నెక్కువపాఠములును ఎక్కువశ్రమలునుతప్ప వేరేమియు లేదు. అందరుబాలురతోడ పాఠముల నందినపిదప, వారి యుపాధ్యాయుడు వారికికొన్ని పాఠములిచ్చెదరన్ననును తక్షణమే యతని యాజ్ఞను బాలురు నెరవేర్తురు. వారీసంచారము ప్రారంభించినది మొదలు ఒకడైరీ అనగా దినచర్యను తెలియజేయు పుస్తక మొకటి దగ్గరనుంచుకొని తమ ప్రయాణములలో తాము చూచిన వింతలను ముఖ్యాంశములను ఏయేదినముల నేయేస గతి జరిగినదియు నందువ్రాయుచుండిరి. ప్రతిదినము రాత్రి యెంత ప్రొద్దుపోయినను వారెంత అలసట చెందియుండినను ఆ దిన సమాచారముల డైరీలో వారు వ్రాసియే తీరవలెను. ఇట్లా రాచబిడ్డలు డైరీలో వ్రాసినసంగతులన్నియు రెండు గొప్ప సంపుటములుగా చేర్చబడి ఇప్పటికిని భద్రముగా కాపాడబడుచున్నవి.

బచ్ఛాంటి నావలో ఆరాచబిడ్డలు చేరిన తర్వాత కొంతకాలమునకు వారు ప్లిమత్ సౌండు అనురేవు పట్టణమునకువెళ్ళి అక్కడినుండి ఆగస్టు ౨౮-తేదిని

స్పితెడ్ రేవుపట్టణమును జేరిరి. అక్కడ ఆబాలురిరు వురు తమతల్లిగారిని కలిసికొని ఆమెపుట్టినింటికి వెళ్లిరి. ఆమె బాలుర వెంటబెట్టుకొని తమ తండ్రిగారగు డెన్మార్కు రాజుగారిల్లు ప్రవేశింపగనే తండ్రిమొదలగువారెదుర్కొని బిడ్డలను తల్లినిచూచి సంతోషభరితాంతరంగులైరి. ఆరాచబిడ్డలక్కడినుండి సెప్టెంబరు 17 తేదిన తమవిద్యకై నావవద్దకు జేరిరి. వారచ్చట జేరగనే తండ్రిగారు కుమారరత్నమును జూచుటకై విచ్చేసిరి. తండ్రిగారపుడు యువరాజుగానుండినను వారికిగల వివిధకార్యములచే కొంచెమైనను తీరిక లేక యుండెడివారు. అట్లున్నప్పటికిని వ్యవధి కలిగినపుడెల్ల కుమారులను జూచుటకై వచ్చుచుండెడివారు. తండ్రిగారు పుత్రులజూచి వెళ్లినతర్వాత బాలురిరువురు వారి ప్రయాణమును యథావిధిగ సాగించిరి. త్రోవలో వారికి చిత్రముగ దోచిన సంగతు లన్నియు వారు డైరీలో వ్రాయుచుండిరి. బాలురుగనుక, విశేషపక్షులు గుంపులు గుంపులుగా నాకాశమున నెగురుచున్నప్పుడును సముద్రములో పెద్దపెద్ద చేపలు కనబడినపుడును ఇతర జలజంతు

వులను జూచినపుడును వారు మిక్కిలి సంతోషము నొందెడివారు. అటులు పయనమై వారు జిబ్రాల్టరు చేరిరి. అక్కడి పండ్లతోటలను జూచి వారానందించిరి. ఆతోటలలోని అత్తిపండ్లు, దానిమ్మపండ్లు మొదలగునవికొన్నింటి నావికోద్యోగియు లాబాలురకు తెచ్చియిచ్చిరి. ఇంగ్లాండునుండి మెయిలుస్టీమరులో జాబులు వార్తాపత్రికలు వచ్చువరకు వారు జిబ్రాల్టరులోనుండి, తర్వాత మైనార్కాలోని మేహాన్ రేవుపట్టణమునకు బోయిరి. ఈ మేహాన్ రేవు మధ్యధరాసముద్రములోని స్థలములలోనెల్ల రామణీయకమైనది. ఈరేవు స్వాధీనమునకై ఐరోపియనులలో పలువివాదములు జరుగుచుండి ప్రభుత్వమునందెన్నెన్నో మార్పులు బొందుచుండినను, ఈ పట్టణమున ఆంగ్లేయులచే కట్టబడిన గవర్నమెంటు ఆఫీసులును, ఆంగ్లేయ శిల్పులచే చేయబడిన పనులును ఇప్పటికిని చూపరులకు ఈపట్టణము ఆంగ్లేయుల స్వాధీనములో విశేషకాలముండెనని సూచించుచిహ్నములుగ కానవచ్చుచున్నవి. రాచబిడ్డలు ఈరేవునందు చూడదగినస్థలముల వీక్షించి, సంతో

షమునొంది పాలర్మో అనుస్థలమునకు బోయిరి. వారిద్దరిలో ఆప్రదేశము పూర్వచరిత్ర కొంతవ్రాసి అక్కడ తైలధారజేసి పెట్టెలలో నుంచబడియుండిన శవములను జూచినట్లును, ఆశవములను భూమిలో పూడ్చిపెట్టుటకుముందుగా పెట్టెలలో కొంత కాలము ప్రదర్శింతురనియు, కొన్ని శవములు నిలుచుకొనియున్నట్లుగను కొన్ని కూర్చొనియున్నట్లుగను పలువిధములు సమర్చబడి యుండిననియు, వానినిజూడగా తమ కసహ్యముకలిగెననియు, రాచబిడ్డలు వ్రాసిరి. ఈ శవప్రదర్శనము ఆ స్థలమున మిక్కిలి ముఖ్యమైనదిగా నెంచబడి అచ్చటికి వెళ్లిన వారందరు దానినిచూచి వచ్చెదరట. అక్కడనుండి వారు స్ట్రాంబోలీ అను అగ్నిపర్వతము వెంబడిగా మెసీనాపట్టణమునకు బోయిదిగిరి. అక్కడ రైలుబండియెక్కి మాంటివెనీరి అను కొండను జూచుటకుబోయిరి. ఆ కొండప్రాంతములనుండు శిథిలములైన గ్రీక్‌రోమన్ నాటకశాలల జూచిరి. అంతట మెసీనాకు వెళ్లి బచాంటినావలో జిబ్రాల్టరు చేరిరి. ఈపర్యాయము జిబ్రాల్టరున చాలాదినములు

అనగా నవంబరు 6 వ తేది మొదలు 16 వ తేది వరకు నివసించిరి. ఆనెల 9 తేది తమ తండ్రిగారి జన్మదివసమగుటచే పండుగజేసికొని, తాము శృంగారించికొని తమయోడలను శృంగారించి స్నేహితులంగూడి సంతోషముగా కాలముగడపిరి ఆపట్టణవాసులును వారిని ఉచితవిధముల సన్మానించిరి. రాచబిడ్డలు జిబ్రాల్టరువదలి దక్షిణముగా కనారాద్వీపములకు వెళ్లి అట్లాంటిక్ మహాసముద్రము ద్వారా పశ్చిమ ఇండియాద్వీపములకు బోయిరి. స్పెయిన్ వారిచే పూర్వము పట్టుకొనబడి శాంటాక్రజ్ ద్వీపమున క్రైస్తవదేవాలయములలో పెట్టెలయందు జాగ్రతగా కాపాడబడుచున్న సుప్రసిద్ధమైన జండాలనుజూచి వారు సంతోషించిరి. బార్బడోస్ ద్వీపములలో వారు ప్రథమమున చెరకును భక్షించిరి. మరియు నిద్దరు ధృఢకాయులును ఆజానుబాహులునగు నీగ్రోలు టెంకాయలుతెచ్చి తమ మోచేతులమధ్యనుంచి పీచుతీసి కాయమధ్య రంధ్రము జేసి నీరుత్రాగుటకై రాచకుమారుల కతివిధేయతతో నీయగా, వారు నీరుత్రాగి బహుకుతూ

హాలమంది ఆనీగ్రోల శరీరదార్ఢ్యమునకును వారి భక్తికిని వారిని మెచ్చుకొనిరి. ఈబార్బడో ద్వీపములో వారున్నంతకాలము వారును ప్రజలును బహుసంతోషముగా నుండిరి. అక్కడినుండి రాచబిడ్డలు ట్రినిడాడ్ ద్వీపములకు వెళ్లిరి. ఆద్వీపములు సమశీతోష్ణస్థితిగలవి గాన అచ్చట లవంగపుచెట్లు, జాజికాయచెట్లు మొదలగునవి పెరుగును. ఆవృక్షముల నారాచబిడ్డలదివరకు చూచియుండలేదు; గావున వానిని, మఱియు నాద్వీపములలో సహజముగా పెరుగు కొన్నిపక్షులను వారుచూచి సంతోషించిరి. ఈట్రినిడాడ్ ద్వీపములలో చూడదగినవానిలో ముఖ్యమైనది పిచ్ లేక్ అనగా నల్లనివర్ణముగల యొక పెద్దసరస్సు. అది అరమైలు విస్తీర్ణముగలది; చుట్టు అస్ఫాల్టుఅను శిమెంటుకుపయోగపడు పదార్థముకలదు. దానిమధ్య నీరుడుకుచు పొగలెగయుచుండును. రాచబిడ్డల్లాప్రదేశమునకుంజని అంతయు విమర్శించిరి ఆద్వీపములలో వారొకపక్షమురోజులుండి గ్రెనాడాద్వీపములకు వెళ్లిరి. అక్కడ కొన్నిరోజులు నివసించి ఆయాద్వీపములపూర్వచరిత్రలను

అందలి ముఖ్యాంశములను గమనించి శేంట్ లూషియా, టొబాగో, శేంట్ విం శేంట్ అనుద్వీపములను జూచుకొని జమైకామీదుగా బెర్ముడాస్ చేరిరి. అక్కడినుండి రాచబిడ్డలు మాతృదేశమునకువిచ్చేసి జననీజనకుల చెంత జేరిరి.



# అయిదవ అధ్యాయము



బ ఛాం టి నా వ లో రెం డ వ సం చా ర ము

రాచబిడ్డ లిరువురు ఇంగ్లాండులో కొంతకాల ముండి మరల బఛాంటినావం జేరి ఐర్లాండుమీదుగా ఆగష్టునెలలో తిరిగి స్పితెడ్ రేవుకు వచ్చిచేరిరి. ప్రథమ సంచారములో నిదివరకు వారు పశ్చిమ ఇండియాద్వీపములం జూచిరి. ద్వితీయయాత్రలో వారు దక్షిణఅమెరికా ఉత్తర అమెరికాలలో కొంత భాగము, జపాను, చైనా, సింహళద్వీపము, ఈజిప్టు పాలెస్టైనమున్నగు దేశములు దర్శింప దలచిరి. 1880 వ సంవత్సరము అక్టోబరు 31 తేదిన వారు బయలుదేరి మెడీరా కేప్ వెర్డ్ ద్వీపములకు బోయిరి. అక్కడినుండి 3500 మైళ్లు సముద్రప్రయాణము చేయనెంచి మాంటివిడియో అనుప్రదేశమునకు వెళ్లిరి. 1881 వ సంవత్సరము సంవత్సరాది పండు గను వారు విల్లానోవా అనుప్రదేశమున గడపిరి. అక్కడనుండి వారు ఫాక్లెండుద్వీపములకు పయన

మైరి. గాలి ప్రతికూలముగా నుండుటవలన వారు అనేకకష్టములతో శాన్లీ రేవుకువచ్చి చేరిరి. అచ్చట చేరిన మరుసటిరోజుననే వారు తక్షణమే కేప్ ఆఫ్ గుడ్ హోప్‌కు పోవలసినట్లు వారికి తంతివార్త రాగా ఫాక్ లెండ్ ద్వీపముల ప్రయాణముమానుకొని కేప్ఆఫ్‌గుడ్ హోప్‌కు బయలుదేరిరి ఈ ప్రయాణ మార్గము రాకొమరులకు కడువింతగా నుండెను. శాన్లీహార్బరు మొదలు సైమన్సుబే వరకు నాలుగు వేలమైళ్ల ప్రయాణములో మరియొక యోడగాని స్టీమరుగాని యేమియు వారికి కనుబడక పోయెను. అక్కడక్కడ గగనమార్గమునపోవు పక్షులకలవర ముతప్ప మనుజసంచార మేమియు లేకపోయెను. అదిచూచి యాబాలురకు ఆశ్చర్యమయ్యెను. సైమన్సుబే చేరువరకు వారేల తక్షణమే కేప్ఆఫ్‌గుడ్ హోప్‌కు పోవలసినట్లు తీర్మానింపబడెనో తెలియకుండెను అక్కడచేరగానే దక్షిణ ఆఫ్రికాలోని బోయర్ల తిరుగుబాటువలన యుద్ధమునకై వచ్చు సేనకు సహాయ్యముగా తామచ్చటికి రప్పింపబడిరని తెలియవచ్చెను. అక్కడవారు ఫిబ్రవరి 16 తేదిన

చేరి ఏప్రెపెల్ 9 తేదివరకు ఉండిరి; కాని తగినపని కనుబడక పోయెను. రాజీ కుదురుటచే నచ్చుటికి వచ్చిన సేనానీకములన్నియు వెనుకకుతిరిగి వెళ్లెను. రాచబిడ్డలు అక్కడ చెరసాలలో నుండిన జూలూ రాజగు కెచ్వాయో యనువాని దీర్ఘకాయమును జూచి ఆశ్చర్యపడిరి. ఆయనకు ఆంగ్లేయభాషరాదు గాన వానితో రాకొమరులు మునిషీద్వారా సంభాషించిరి జూలూరాజు తనపగను గనబరచుచు తన్ను వదలినచో తనశత్రువుల జీల్చి చెండాడుదుననియు తనకు విక్టోరియా రాణిమీాద నెంతమాత్రము పగ లేదనియు ఆమెనౌకరులు ఆమెగారేమో చెప్పినట్లు నటించుచు దుర్మార్గముగ ప్రవర్తించుచుండుటచే వారియందు తనకు అసూయత కలదనియు ఈవిధముగా నొక గొప్పయుపన్యాసమిచ్చెను ఆరాకుమారులు దయతో సాదరముగ నాయుపన్యాసమును విని వానికి శాంతవచనములచెప్పి యూరడించిరి. ఆజూలూరాజుకు నలుగురుభార్యలు కలరు. ఆయన చెరసాలలో నుండినను, వాని దుఃఖమును కొంచెము శమింపజేయుటకై భార్యలాతనివద్ద నుండుటకు

అనుమతి యొసంగబడెను. భార్యలును వానివలెనే మిక్కిలి బలముగలవారును దీర్ఘ స్థూల శరీరులును యగుటవలన జూలూరాజుకు తగినభార్యలే యని రాకుమారులు విస్మయమందిరి.

రాచబిడ్డలు కేప్ టౌనులోనుండు చిత్రవిచిత్రములం దర్శించి ప్రజలస్వాగతములనంది మెల్బోరనుకు పయనమైరి. కేప్ టౌనునుండి మెల్బోరనుకు సుమారు ఆరు వేలమైళ్ళ ప్రయాణము. ఈమధ్య శెంట్ పాల్ న్యూఆంస్టర్ డాం అను రెండుద్వీపములు తప్ప మరే ప్రదేశములును లేవు. సముద్రయానమునకు అనను కూలమగు గాలి వీచుచుండుటవలన నావ లెచ్చట మునుగునో యని ప్రయాణీకులు భీతిల్లుచుండిరి. రాచకుమారు లెట్టకేలకు ఆల్బెనీద్వీపముం జేరిరి. అచ్చటికి ముప్పదిమైళ్ల దూరములో మార్ బ్లప్ అను ప్రదేశమున నొకస్కాచ్ దేశీయుఁడు తన కుటుంబ ముతో సంసారముచేయుచుండెను. ఆయన రాకు మారుల గడుప్రీతితో నాహ్వానముచేసి తనగృహ మున వారికి వలయువసతుల నేర్పాటుచేసి వారిని గౌరవించెను. రాచకుమారులు పూర్వపు సముద్ర

యానమున నొందిన శ్రమను తీర్చికొని విశ్రాంతినొం దుచు కొంతకాలమచ్చట నివసించిరి. ఆసంవత్సరపు మేనెల 24 తేదిన రాణిగారి జన్మదినసమయ్యెను. నాటిదినము ఆస్ట్రేలియన్లు రాణిగారిపౌత్రులకు స్వా గతమొసంగి అనేకవిధముల బహూకరించిరి. రాకొ మారులు ప్రజలవిన్న పపత్రికలనంది తగినప్రత్యుత్తర ములిచ్చి ప్రజలసంతోషపెట్టిరి. ఇట్లు మూడువార ములు ఆల్బెనీపట్టణముననుండి అడిలేడియను ప్రదే శమునకు పయనమైరి. అక్కడ ప్రజలస్వాగతము లను యథావిధిగ గైకొని జూన్ నెల 20 తేది బయ లుదేరి మెల్బోరనునకు ప్రయాణమైరి. ఈప్రయా ణము సముద్రముమీదచేయక మెట్టదారిని చేయ దలంచిరిగాన సుమారు 600 మైళ్లు బండ్లమీదను గుర్రములమీదను ప్రయాణము సలిపిరి. మెల్బోర నుచేరి, చుట్టుప్రక్కలనుండు ముఖ్యప్రదేశములం దర్శించి, జూలై నెల 8 తేదిన మెల్బోరనువదలి శిడ్నే, బ్రిస్ బేన్ అనుప్రదేశములకు వెళ్లిరి శిడ్నేద్వీప మున విక్టోరియామహారాణిగారి ప్రతిమను స్థాపింప దలచి, రాచకుమారులచే నాప్రతిమకు శంఖుస్థాపన

మహోత్సవమును మిక్కిలి వైభవముతో జరుప దలంచియున్న ఆపట్టణప్రజలకోరిక ప్రకారము, ప్రిన్సు విక్టరుగారును ప్రిన్సుజార్జిగారును సంతోషముచే నుప్పొంగుచున్న సుమారు 70 వేల జనులమధ్య శకటారోహులై రాజసన్మానమునందుచు నూరే గింపుతో నాస్థలమునకు విచ్చేసి ప్రిన్సువిక్టరుగారు శంఖుస్థాపన జేసిరి. ఆదివసమంతయు ప్రజలసంతోష ము చెప్పనలవిగాకుండెను. రాచకుమారులు ఆపు రవాసులనాదరించి బచాంటియోడలో బ్రిస్ బేనుకు పోయిరి. ఈవిధముగ రాచకుమారులు మూడు నెలలు ఆస్ట్రేలియాద్వీపములలో వాసముచేయుట వలన ఆస్ట్రేలియనుల రాజభక్తిని శ్రీవారు బాగుగ గమనించి వారాద్వీపములవదలునపుడు "ఇంగ్లాండు దేశము వెనుక ఆస్ట్రేలియాదేశమే మామనముల యందెక్కువ ప్రీతికరమగుస్థానము నాక్రమించు కొనును" అని వక్కాణించిరి. రాచకుమారులు ఆగస్టునెల 20 తేదిన బ్రిస్ బేనునుండి ఫిజిద్వీపము లకు బయలుదేరి సెప్టంబరునెల 3 తేదిన అచ్చట జేరిరి. నాటికి 15 సంవత్సరములకుపూర్వము ఆఫిజి

ద్వీపవాసులు నరమాంసభక్షకులుగా నుండిరి. కాని కాలక్రమమున వారా పైశాచిక కృత్యములమాని కొంచెమునాగరికులైరి. మోటుస్థలముగ నెంచబడిన యాప్రదేశమున సహితము ద్వీపవాసుల స్వాగత ములు వినయవిధేయతలు రాచకుమారుల కెంతో యాశ్చర్యముకలుగ జేసెను. మరియు నాదీవులలో ప్రతిబాలుడును బాలికయు వ్రాయను చదువను తప్పక నేర్చుకొనవలసినట్లు విధాయకమనివిన రాచ కుమారులకు, రాచకుమారులకే యననేల, నాగరి కులమని విఱ్ఱవీగు హిందూదేశీయులకునహా, కడు విస్మయమును ఆనందమునుకలిగెను. ఆద్వీపవాసులు రాకుమారులకు అచ్చట విచిత్రవస్తువులను బహు మతియొసంగిరి; మరియు తిమింగిలపుకోరలను రెండు వారికి సమర్పించుకొనిరి. రాకుమారులు ప్రజలరాజ భక్తికి మిక్కిలిమెచ్చుకొని సెప్టెంబరు 10 తేదిన విటి అను దీవులనుండి బయలుదేరి పెసిఫిక్ మహా సముద్రముమీదుగా 41 రోజులు ప్రయాణముజేసి అక్టోబరు 21 తేదిన యొకొహామా అనురేవుపట్టణ మును జేరిరి. జపానుద్వీపమునచేరగనే, జపానీయులు

శీఘ్రకాలములో పాశ్చాత్యుల ఆదర్శములను పద్ధతులను నేర్చుకొని అనేక విధముల నభివృద్ధినొంది యుండుటను శ్రీవార్లు కాంచి సంతోషించిరి. ఆరాకుమారులు జపానుద్వీపములో నుండువరకు వారికే మాత్రమును లోపములేక సమస్తమైన మర్యాదలు జరుగుచుండుటకై, జపాను చక్రవర్తిగారు ప్రిన్సు హిగాషి ఫుషియామా యనువారిని నియమించిరి. ఈయన రాకుమారులకు ఇంగ్లాండులో నుండగా పరిచయముగలవాడుగాన ప్రాత స్నేహితుడైన ఈయనను చూచి ముచ్చటించుటకు రాకుమారులు సంతోషించిరి. రాకుమారు లిరువురు తమ యధికారివద్ద సెలవుగైకొని రైలెక్కి 20 మైళ్లదూరములో నున్న టోకియో యను పట్టణమునకు బోయిరి. ఇక్కడ రాకుమారులు జింరిక్షాలలో కూర్చొని మనుజులచే లాగించుకొనిరి. ఈమనుజులు గంటకు ఆరుమైళ్లవంతున కొండలమీద సహితము అదే విధముగా లాగుదురట. మనుజులచే శకటముల లాగించుకొనుట అదివరకు వినికనియుండని యీ రాకుమారులకు వింతగానుండెను. అక్టోబరు 25-వ

తేదిన జపాను చక్రవర్తిగారగు మత్సుహితోగారిం దర్శించుటకు పోయిరి. వారు ఐరోపియనుల అల వాటులను పద్ధతులను దమప్రజలు నేర్చుకొనిన బాగుండునని తత్కార్య సిద్ధికై కృషిచేయుట యందు, స్వదేశ వస్తువులు స్వదేశాచారములే పాశ్చాత్యాచారములు వస్తువులకంటె మిన్నగా నుండినను అది గమనింపక కొన్ని విషయములలో తొందరబడుచున్నారనియు కొన్ని మార్పులు అనా వశ్యకములనియు రాకుమారులు అభిప్రాయపడిరి. జపాను చక్రవర్తిగారు రాకుమారుల నర్హావిధమున సన్మానించి వారినిచూచుట కెంతో సంతోషించె ననియు, తన కుమారుడు గ్రీణ్విచ్ నావికాకళా శాలలో విద్యనందు సమయమున, ఆస్బోరను భవన మున శ్రీమహారాణిగారిని దర్శింప వెళ్లినపుడు ఆమెగారాతని కొసంగిన మర్యాదచే దానెంతయు గౌరవింపబడినట్లుగా నెంచెననియు తన వందనముల రాణిగారికి తెలుపుడనియు తనకును ఆంగ్లేయ రాజ్యాధిపతులకును గల స్నేహభావముల బల పరచుటకై ఒకరినొకరు అప్పుడప్పుడు సందర్శించు

కొనుచుండుట మంచిదనియు వ్రాసుచ్చిరి. జార్జి రాకొమారుడు తగిన ప్రత్యుత్తరమిచ్చి మహారాణి గారెపుడును అన్య దేశాధిపతులకు సుస్వాగత మిచ్చుటకు సంసిద్ధురాలని జవాబిచ్చిరి. విక్టరు రాకొమారుడు జపానుచక్రవర్తినిగారికి ఆస్ట్రేలియా నుండి తాము తెచ్చిన రెండు (Wallabies) 'వాల్లబీలు' అను మృగములను బహుమతులొసంగిరి. జపాను దీవులలో వట్టిజంతువులులేవు గాన చక్రవర్తినిగారతిసంతోషముతో వానింగైకొని రాకొమారుల ప్రేమకు వందనముచేసిరి. రాకొమారుల వినోదార్థము జపాను చక్రవర్తిగారు కొన్ని ఆట పాటల నేర్పాటుచేసెను. ఇవ్విధముగ రాకొమారులు చక్రవర్తిగారి ఆతిథ్యమునంది ఒసాకా క్యైటో పట్టణములకు బోయిరి. అక్కడ బౌద్ధదేవాలయములం దర్శించి బౌద్ధమతాచారములను కొన్ని కనుగొనిరి. అక్కడ జపానీయుల గృహములలోపలికి ప్రవేశించునపుడు కాలిమేజోడును తీసిపోవుచుండిరి. ఏలయన జపానీయుల గృహములలో క్రింద నొకసొగసైన చాపయొకటి పరువబడియుండును;

కాలిజోడుతో దానిం[ద్రొక్కిన నది చెడిపోవును ; గాన జార్జి రాకొమారు డది గమనించి జపానీయులకు తగిన మర్యాదజూపి తన గొప్పగుణమును గనబర చెను అక్కడినుండి రాకొమారులు మరికొన్ని [ప్రదేశములం దర్శించి నవంబరునెల 17 తేదిన చైనాదేశమునకు బయలుదేరిరి. వారు చీనాదేశ ములో ముఖ్యపట్టణములను కొన్ని వీక్షించి యందలి [ప్రజల ఆచారములను గమనించి [ప్రజల స్వాగత మందుచు కొంత కాలమచ్చట గడపిరి. అచ్చట రాచ కుమారులకు వేటకై తగిన సౌకర్యములుండుటచే గహన భూములలో వేటాడుచు కొంతకాలము పుచ్చుచుండిరి. కొన్ని పట్టణముల అనగా నింగ్పో మొదలగువాని వీధులు విశేషమాలిన్యముకలవై అసహ్యముగా నుండుటచే, అట్టి [ప్రదేశములలో విశేషకాలముండక, ఆవలి పట్టణములకు వెళ్లు చుండిరి. [శీవారలు కాంటన్ పట్టణమునందలి [ప్రసిద్ధికెక్కిన తోటలనుచూచి శింగపూరుకు వెళ్లిరి. శింగపూరులో చీనావారు రాకుమారులకు నాలుగు వేల పౌన్లు ఖర్చుచేసి ఘనమైన స్వాగతంబొసగిరి.

శింగపూరునం దారురోజులుండి అక్కడ జోహారు మహారాజుగారి భవనమును దర్శించి, రాజుగారిచే సన్మానమునంది వివిధవినోదములందు కాలముపుచ్చి బఘాంటినావ జేరి, సింహళ ద్వీపమునకు బయలు దేరిరి.

సింహళ ద్వీపమున వారు కొలంబో పట్టణమున దిగి అచ్చట రాకుమారులరాకకై నిరీక్షించుచుండు బహుజనసమూహముయొక్క స్వాగతముల సంతోషముకొనందిరి. తర్వాత కాండీపట్టణమునకు వెళ్లి ప్రసిద్ధ బౌద్ధదేవాలయములను అందలి శిల్పవిశేషములను గమనించిరి. అక్కడ 'దాలాడామలిగావా' అను బౌద్ధదేవాలయమునందు కాపాడబడియున్న మహనీయు గౌతమబుద్ధుని దంతము నొకదానిం జూచిరి. మొత్తమున రాకుమారులు సింహళద్వీపమున సొరపదుము రోజులుండి ఈజిప్టుదేశమునకు పోయిరి. ఈజిప్టురాజగు కేడివ్ గారు కైరోపట్టణము వద్ద రాచకుమారులకు స్వాగతమిచ్చెను. ఆయన రాకుమారులిరువురకు సొగసైనహుక్కాలు రెంటి నిబహుమతిగా నొసగెను. అంతట కైరోపట్టణము

యొక్క నలుభాగముల కలయజూచి, త్రోవనంతయు ప్రజలస్వాగతములనంది వారి సంతోషమునకు విస్మయమంది వారిరువురు పిరమిడ్సును చూచుటకు వెళ్లిరి. పిరమిడ్సు క్రింది అరుగున నుండి ఉన్నత శిఖరమువరకు 456 అడుగుల యెత్తు. రాకొమారు లిరువురుచూపరుల కాశ్చర్యము కలుగునట్లు 15 నిమిషములలోనే, ఆశిఖరము నెక్కి చుట్టునుండెడి ఇసుక యెడారులం దర్శించిరి. ఆవల వారు ఈజప్టుదేశపు కంచరగాడిదెలనెక్కి తల స్త్రీ ఆకారమును దేహము సింహాకారమునుగల యొక దేవతను చూడ నొకయెడారికి వెళ్లిరి. తర్వాత బూలక్ మ్యూజియం దర్శించి అక్కడ ఈజిప్టుదేశపు ప్రాచీనరాజులయొక్కయు రాణులయొక్కయు గోరీలనుండి తీయబడిన విలువగల పదార్థములును వారు ధరించిన ఆభరణములును కళేబరములును ప్రదర్శింపబడియుండుటను జూచిరి. ఈజిప్టుదేశములో వారి ప్రయాణము చాలామట్టుకు మిక్కిలి వేగముగా పరుగిడునట్టివియు మన గుఱ్ఱములవలె నుండునవియు నగు కంచరగాడిదెలమీదనే జరుపవలసివచ్చెను.

ఆవల రాకుమారులు నైలు నదిమీదుగా వెళ్లి అలె గ్జాండ్రియా రేవుచేరి బచ్చాంటినావనెక్కి క్రైస్తవులకు మిక్కిలి పుణ్యభూమియని ప్రసిద్ధిజెందిన పాలెస్టైన్ దేశమును దర్శింపబోయిరి.

పాలెస్టైన్‌లో లిడ్డావద్ద రాకొమారుల నివాస మునకై గుడారములమర్చబడెను. వారచ్చట బస చేసి కొంతవిశ్రాంతిపుచ్చుకొని ఆపుణ్యక్షేత్రమున గల దేవాలయములను చిత్రవిచిత్రవస్తువులనుదర్శింప పయనమైరి. ఏసుక్రీస్తుయొక్క మహిమలన్నియు ఈక్షేత్రముననే జరుగబడినవి. ఆయనగారు లోక సంరక్షణార్థమై పడినశ్రమలను సూచించు చిహ్నా ములును, వారికిసేవజేసి ముక్తినొందిన భక్తశ్రేణి యొక్క ప్రతిమలును, వారిసమాధులును చూడ నేతెంచు యాత్రికుల భక్తిని ద్విగుణముజేయు చున్నవి రాకొమారులుమార్చి 31 తేదిన జెరుసు లేం పట్టణమున జేరిరి. వారు ఆపుణ్యక్షేత్రముయొక్క చరిత్రనొకటి దగ్గరనుంచుకొని అందులో ముఖ్య ముగా పేర్కొనబడిన స్థలములన్నియు దర్శించిరి.

ప్రతిప్రతిమయొక్క చరిత్రయు వారు సవిమర్శముగ విచారించిరి. ఏప్రల్ నెల 4 తేదివరకు జరుసులేం నందుండి తర్వాత హేబ్రానుకు పోయిరి. అచ్చట క్రైస్తవ మహాపురుషులగు ఏబ్రహాం, ఐసాక్, శారా, జాకోబ్ అనువారల సమాధులుకలవు. రాకొమారులు వానిందర్శించిబెతలహేంకుపోయిరి. అక్కడనుండి జార్డాన్ నదివెంబడి కొన్ని ముఖ్యపట్టణములం గాంచిరి. ఈప్రయాణములో గలిలీ సముద్రమువద్ద మాత్రము అచ్చటి నివాసులు రాకుమారులకు కొంచెముఅనాదరణజూపిరి. అక్కడ ఓడనిలిచినప్పుడు, అరబ్బులు కొందరు గుంపుచేరి రాచకుమారుల పరిహాసముచేయుచు కేకలువేసిరి. ఆపోకిరిగుంపును రాకుమార్షులుచూచి వారితో వివాదములవలన ప్రయోజనములేదని గమనించి తక్షణమే తమయోడనెక్కి ప్రయాణము సాగించిరి. కొందరు దుర్మార్గులు ఓడమీద రాళ్లు రువ్విరి. మోటువారును జ్ఞాన శూన్యులునగు ఆయరబ్బులతో తర్కమువలన లాభములేకపోవుటయేగాక యొకవేళ అపాయము సహా సంభవింపవచ్చునని

యోడకాప్టెనుగారు తలంచి, వారి దుర్మార్గకృత్య ములను లక్ష్యము చేయక ప్రయాణముజరపిరి. జరికో వద్దనుండగా రాజకుమారులకు ఇంగ్లాండునుండి జాబులువచ్చెను. అందులో నొకజాబులో ఆంగ్లేయ కవిసింహుడగు లాంగ్ ఫెల్లో అను మహనీయుడు మృతినొందెనని తెలిసి శ్రీవార్లుచింతించిరి. అక్కడి నుండి రాజకుమారులు మరికొన్ని ముఖ్యప్రదేశ ములంజూచుచు ఆయాస్థలములలో పౌరులు తమ కిచ్చెడు స్వాగతములం గైకొనుచు ఈపుణ్యభూమి యందు మొత్తమున నలుబదిరోజులు సంచారము చేసి తమదేవుడగు ఏసుక్రీస్తుగారియొక్క మహిమ లను స్వయముగా వీక్షించి, ఆనందమునొందుచు, భక్తిశ్రద్ధలతో పుణ్యక్షేత్రముల నన్నియు దర్శించు టచేపావనులైనట్లెంచిరి.

రాజకుమారు లిరువురు 1882 సంవత్సరం మేనెల 7-వ తేది బీరూట్ పట్టణమును వదలినపుడు త్వరలో స్వగృహమునకు చేరుచున్నామని వారి మనములయందు సంతోషతరంగము లుప్పొంగు చుండెను. ఎప్పుడెప్పుడు వెళ్లి తమ జననీజనకులను

సోదరీసోదరులను అన్యబంధువర్గమును చూతుమా యని ఆతురపడుచుండిరి. ఆథెన్సుపట్టణముమీదుగా బోవుచు రాకుమారులు మే నెల 22 - వ తేదిన సూడాబేలోచేరి ఆస్థలమునకుమిక్కుడియున్న యుద్ధ నావలంజూచిరి. అపుడు ఈజిప్టులో అలెగ్జాండ్రియా వద్ద యుద్ధముజరుగుచుండెను. బఛాంటినావలో విద్యనేర్చుకొనుచుండు మిడ్‌షిప్‌మెన్లకు అపుడే పరీక్షలు జరుగుచుండెను. ఈపరీక్షలలో జార్జిరా కుమారుడు ఘనముగాజయప్రదుడయ్యెను. తర్వాత వారు బఛాంటినావలో క్రీట్ వదలి అయోనియన్ ద్వీపములగుండా జూలై నెల 25-వ తేదికి జిబ్రాల్టరును వదలిరి. ఆగస్టునెల 4 తేదికి వారు ఇంగ్లాండు సమీపించి డివన్‌షైరు పరిభూములజూడగనే, జననీ జనకులచూచు సంతోషము పొర్లిపొర్లి వచ్చుచుండెను. స్పానెజ్ బే యనుప్రదేశమునకు కొంచెము దూరములో తమ్మెదుర్కొనుటకు జననీజనకులును సోదరీసుణులును వచ్చు ఆస్బోర్న్ అను ఓడ రాకుమారులకు కనబడగా తమవందనములు తెలుపుచు పూర్వము మన వీరులు పెద్దలనుచూచి

రప్పుడు నమస్కార బాణములను వేసి గౌరవించు చుండిన వితాన తమదేశపు నాచారమ్మునను సరించి 31 తుపాకులు బచ్ఛాంటినావనుండి కాల్చిరి. ఇరు పార్శ్వముల నౌకాధికార్లును సంతోషనాదము లుప్పతిల్ల కేకలు వేయుచుండిరి. యువరాజుగారగు ఎడ్వర్డుగారును, యువరాణిగారగు అలెగ్జాండ్రా గారును వారిపుత్రికలు ముగ్గురును పరివారసమేతులై రాకుమారులచూడ నుద్యుక్తులై అత్యంతాతురతతో బచ్ఛాంటినావలోనికి వెళ్లి, నావకధికారియగు లార్డుఛార్లెస్‌స్కాట్ అనువారికి తమ కుమారరత్నముల సురక్షితముగా నలుబదియైదు వేలమైళ్లు ప్రయాణము సంపూర్ణము చేయించి సౌఖ్యముగా చేర్చినందునకై వందనములుచేసి, రాకుమారులను తమనావలో నెక్కించుకొని రాచనగరునకరిగిరి.



# ఆరవ అధ్యాయము

నౌకాశాస్త్రమునందున్నత శిక్షనొందుట

బఛాంటినావలో రాకుమారులకు విద్యనేర్పిన లార్డుఛార్లెస్ స్కాట్ దొరవారిని ఆస్బోరనుభవనమునకు విక్టోరియా మహారాణిగారు తమతో విందారగించ నాహ్వానముచేసి వారికొక బిరుదునిచ్చి సన్మానించిరి. రాణిగారు రాకుమారుల బఛాంటి నావయొక్క అధికారోద్యోగస్థులుగా ఖాయము చేసిరి. యువరాజుగారు తనకుమారుల శిక్షయందు శ్రద్ధతీసికొనినవారలకు వందనములు జేసి, తమ సంతోషమును తెలియజేయుచు ప్రతిమనుజునకును బహుమతియొసంగిరి. విక్టరురాకొమారుడిక ప్రభుత్వకార్యముల నేర్చుకొనవలసినట్లుగను జార్జిరాకుమారుడు నౌకాశాస్త్రమునందున్నతశిక్ష నొందవలసినట్లుగను వారి తండ్రిగారు నియమించి తత్కార్యార్థమై తగునేర్పాట్లుగావించిరి.

జార్జిరాకుమారుడు 1882 సంవత్సరం ఆగస్టునెల 31 తేదిన బఛాంటినావనువదలి ఆరునెలలకాలము

లా సెనీపట్టణమున ఫ్రెంచిభాష నేర్చుకొనుచుండిరి. తర్వాత 1883 సంవత్సరం మేనెల 1 తేదిన వారు కనాడానావలో మిడ్‌షిప్‌మెన్ అను ఉద్యోగమునకు నియమింపబడి, ఉత్తర అమెరికా, పశ్చిమ హిందూద్వీపముల తీరములలో నొకసంవత్సరము నౌకరిచేసిరి. తన విధ్యుక్తధర్మములను శ్రద్ధతో నిర్వర్తించుచు, పైఅధికారుల యుత్తర్వులకువిధేయుడై. తనసేవకుల నత్యాదరముతోడను కనికరముతోడను జూచుచు శ్రమయని యెంచక యెంత ప్రొద్దుపోయినను తనకార్యములయందేలాటి లోపము లేశమైనను లేకుండునటుల నడచుకొనుచుండిరి. జార్జిరాకొమారుని 19వ జన్మదివసమున అనగా 1884 సంవత్సరం జూన్ నెల 3 తేదిన ఆయన సబ్ లెఫ్టనెంట్ పరీక్షయందు జయమందినట్లును, అందులోనొకశాస్త్రమున మొదటితరగతియందు జయప్రదులైనట్లును తెలిసి, నాటిదినము రాచకుమారునికేగాక అందరికిని మిక్కిలి సంతోషదినముగా నుండెను. తర్వాత కొంతకాలమునకు గ్రీన్‌విచ్ పట్టణమందలి నావికాకళాశాలయందు జేరి యొక

సంవత్సరమునకుపైగా నచ్చట చదివి పరీక్షకు విధింపబడిన అయిదు శాస్త్రములలో నాల్గింటియందు మొదటితరగతిలో జయమందిరి. అంతట 1885 సం॥ అక్టోబరు 8 తేదిన జార్జి రాకొమారుడు లెఫ్టనెంటు పదవికి వృద్ధిచేయబడిరి. మరుసటి సంవత్సరము జనవరి నెలలో థండరర్ అను పొగయోడలో లెఫ్టనెంట్‌గా నుండుటకు నియమింపబడిరి. అక్కడ ఆగస్టునెలవరకు పనిచేయగా డ్రెడ్‌నాట్ అను యోడకు మార్చబడిరి. జార్జిరాకొమారు డక్కడ నుండగా, ఈజిప్టుదేశాధిపతియగు టెపిక్‌పాషా అనువారు రాచకుమారుని చూచుటకై వచ్చిరి. పాషాగారు ప్రాచ్యాచారముల ననుసరించి ఆడంబరమైన యుడుపులధరించుకొని, పోర్టుశేక్రేవులో బొగ్గులుపోసికొనుచుండ డ్రెడ్‌నాట్ ఓడలోనికి వచ్చిరి. వారురాగానే, నావికాధికారియగు కాప్టెన్ గారు వారిని తగినమర్యాదతో నాహ్వానముచేసిరి. వారు కాప్టెన్‌గారితో కొంతసేపు సంభాషించి, జార్జిరాకొమారుని చూడవచ్చితిననిరి. అపుడు జార్జి రాకొమారుడు తనవిధ్యుక్తధర్మము నాచరించుచు,

యోడకు బొగ్గులుపోయుస్థలమున నాపనిని తనికీ చేయుచుండిరిగాన వారియుడుపులును, ముఖమును నల్లనై వికృతాకారముగ నుండెను. సేవకుడువచ్చి, తన్ను కాప్టెన్‌గారు పిలుచుచున్నారని చెప్పగనే, యా యుడుపులతోడనే కాప్టెన్‌గారివద్దకు వచ్చి, నమస్కరించగా, 'ఈతడే జార్జిరాకొమారు'డని కాప్టెన్‌గారు పాషాగారితో చెప్పిరి. పాషాగారు నమ్మక, విస్తీర్ణములైన ఆంగ్లేయరాజ్యముల కధిపతియై ఆగర్భశ్రీమంతుండగు వానిపుత్రుడు ఈవిధమగు కొలువున కంగీకరించి తనశరీరమునకు వికృతాకారమును కలిగించుపనిచేయుట కొడంబడునాయని పాషాగారు కాప్టెన్‌గారెంత చెప్పినను వానిమాటలు విశ్వసింపక, తన్ను పరిహసించుచున్నారని భావించి, కోపోద్దీపితుడై త్వరితముగా లేచివెళ్లెను. దీనిని బట్టి జార్జిరాకొమారుడు తన విధ్యుక్తధర్మముల నెంతయోర్పుతోడను, నిగర్వముతోడను నెరవేర్చుచుండెననియు తా నేయేపనియందు నియమింపబడినను మనస్ఫూర్తిగా నాపనిని నిర్వహించుచుండెననియు గ్రహింపవచ్చును. వారు డ్రెడ్‌నాట్

నావయందు 9 నెలలు పనిచేసినతర్వాత అలెగ్జాండ్రియాయను నావకు మార్చబడిరి. అందు మూడు సంవత్సరములు పనిచేసి 1889 సంవత్సరములో నార్తంబర్ లెండ్ అనునావకు మార్చబడి, యచ్చట స్వతంత్రాధికారముగలకమేండరుగా నుండిరి. పిదప పైదానికంటె ముఖ్యమైన త్రష్ అను నావలో కమేండరుగా మార్చబడిరి. అక్కడనుండగా 1890 వ సంవత్సరమున కింగ్స్టనులో జరుగు పరిశ్రామిక ప్రదర్శనశాలయొక్క కార్యక్రమమును రాణిగారి తర్ఫునవెళ్లి ప్రారంభించిరి. మరుసటి సంవత్సరము ఆగస్టునెల 24 తేదిన వారు మెలంపస్ అనునావకు కమేండరుగామార్చబడిరి. తర్వాత రెండునెలలకు జార్జిరాకొమరుడు డబ్లినుపట్టణమునకు పోయిరి. అక్కడవారికి విషజ్వరము తగిలెను. రషియా రాజును దర్శించబోయిన తమతల్లిగారికి వర్తమానమంపగా వారు శీఘ్రముగావచ్చిరి. జార్జిరాకొమరుడును రోగమువృద్ధియగులోగా డబ్లిన పట్టణమునుండి శాండ్రింగ్హాంభవనమునకు వెళ్లిరి. తర్వాత వారిని లండను నగరమునకు తీసికొనిపోయిరి.

జ్వరము మిక్కిలి తీవ్రమై ప్రాణభయముసహా కలిగెను. కాని ఈశ్వరుని కృపవలన రాజవైద్యుల యౌషధములకు జ్వరము నెమ్మతించి క్రమముగా రాకొమారుఁడు దేహస్వస్థతనొందెను. 1891 సంవత్సరమున జార్జిరాకొమరుని యార్కుదేశమునకు స్వామిగానేమించిరి. నాటినుండి వానిని ప్రజలు యార్కుప్రభువు అని పిలుచుచుండిరి.



# ఏడవ అధ్యాయము

## జ్యేష్ఠ సోదరుని అకాలమరణము

1891 సంవత్సరమున విక్టరు రాకొమారునికి టెక్ రాజుగారి కుమార్తెయు, విద్యాశాలినియు, రూపవతియు, సుగుణవతియునగు మేరీరాకుమారిక నిచ్చి వివాహముచేయ నిశ్చయింపబడెను. విక్టోరియా మహారాణిగారికిని, యువరాజు యువరాణి గార్లకును మెరిరాకుమారికయొక్క గుణగణములు చిన్నప్పటినుండి తెలిసియుండెనుగాన ఆమెయే ముందుముందు యువరాజ్ఞై చక్రవర్తికాబోవు విక్టరు రాకొమరునికి సతీమణియై ఆంగ్లేయ రాజ్యమునకు రాణియై కీర్తిదెచ్చుటకర్హమైన కాంతామణియని వారికి దృఢాభిప్రాయము కలిగెను. కాన ఈ అభిప్రాయమును ప్రజలకు తెలియజేయగా వారును ఈ సంబంధమునకు సమ్మతించిరి. 'అన్యథాచింతితంకార్యం దైవమన్యత్రచింతయేత్' అనులోకోక్తి ఈ సమయమున యదార్థముగ రాచకుటుంబమున పరిణమించెను. 1892 సంవత్సరం జనవరినెలలో

విక్టరు రాకుమారునికి విషజలుబుతలిగి జబ్బుచేసెను. తండ్రిగారును విక్టోరియా మహారాణిగారును అనేక మంది ఘనవైద్యులను పిలిపించి వానికి ఔషధముల నిప్పించిరి. ఆ జాడ్యమున కేయే చికిత్సలుచేయతగునో అన్నియు జేసిరి. ఆంగ్లేయరాజ్య చక్రవర్తినియొక్క మనుమనికి ఔషధసేవయందును ఉపచారములయందును యేమిలోపముండును? ఎన్ని ఘనౌషధము లిచ్చినను, ఎంత ఉపచారములు జేసినను, ఈశ్వరు డొసంగిన వయోపరిమితియు సంపూర్ణమగుచుండగా దానినాపనేరికిశక్యము? రాజబంధువులును, రాచకుమారుని జననీజనకులును, సోదరీ సోదరులును, పితామహియును రాచకుమారుని వెంబడి జేరిరి. విక్టరుగారికి ఆయాసము వృద్ధియయ్యెను. నాడి కొట్టుట తగ్గుచుండెను. మందులన్నియు నిష్ఫలము లయ్యెను. శరీరము చలువలుకమ్మెను. రోగము కనుపించి నాటికి అయిదురోజులుమాత్రమే. అయినను అంత ఆకస్మికముగా విక్టరు రాకుమారునికి అవసానకాలము సంభవించి 1892 సంవత్సరము జనవరినెల 14 తేదిన బంధుమిత్రజనంబుల శోకవారి

ధిలో బడద్రోసి రాకుమారుడు దివంబునకరిగె. జననీజనకుల ప్రథమపుత్రవియోగ శోకభరమెట్లుండెనో వర్ణింపనేరితరము? 'పుత్రదుఃఖంనిరంతరం' అను ఆర్యోక్తి యెంతయు నిక్కముకాదె! శోకములలోనెల్ల పుత్రశోకము, మరియు జ్యేష్ఠపుత్రశోకము మిక్కిలి చురుకైనది. ఆర్యులు శోకముతో సమానమైన శత్రువే లేదని చెప్పుదురు.

శ్లో॥ 'శోకోనాశయతేధైర్యం
శోకోనాశయతేశ్రుతం
శోకోనాశయతేసర్వం
నాస్తిశోకసమోరిపుః.'

అనగా శోకమువలన ధైర్యము, తత్వజ్ఞానము, సర్వము జెడునుకాన శోకముతో సమానమైన శత్రువే లేదనిభావము. దశరథమహారాజు జ్యేష్ఠపుత్రుని కొంతకాలము విడచియుండవలసివచ్చినపుడు పుత్రవియోగ శోకభారమును భరింపజాలక ప్రాణములుండక తల్లడిల్లి విగతాసుండయ్యెగదా. అట్టిపుత్రదుఃఖమును భరింపజాలక ఎడ్వర్డు యువరాజుగారు కుమారరత్నముయొక్క గుణముల దల

చుకొనుచు మిక్కిలిగ దుఃఖించుచుండెను. వారి దుఃఖము నుపశమింప జేయుటకై మంత్రిసత్తములు వారినిసమీపించి రాజేంద్రా, దుఃఖమునువదలుము. ధైర్యమున వలంబింపుము. గడచినదానికి వగచి ప్రయోజనమేమి యని యూరడింపుమాట లెన్నియో చెప్పిరి కాని కాలక్రమమున నుపశమింపదగిన శోకము నంతత్వరలో నాపుట కెవరికినిశక్యముగాదు. ఆంగ్లేయ రాజ్యములకు రాణినగు దునుగదాయని సంతోషించుచుండి పిడుగువంటి ఈ దుఃఖవార్త చెవిసోకగనే భగ్నమనోరథయైనకల్పించి హాహాకారములెసగ బోరుననేడ్చుచుండు మేరీరాకుమారిక యొక్క శోకతీవ్రమును చదువరు లూహింపవచ్చును. వివాహదివసమునకై యెదురుచూచుచుండిన యాశాంతామణి కిట్టియుపద్రవము సంభవించినందునకై ప్రజలెల్లరు దుఃఖించిరి. ప్రపంచమందలి వివిధదేశములనుండి రాచకుమారునిచావుకు చింతిల్లుచు జననీజనకులకును జార్జి రాకొమారునికిని వర్తమానములువచ్చెను. రాకొమరు లిరువురు నావికావిద్యనేర్చుకొనుచు వివిధదేశములలో సంచరించి

యున్నందున విక్టరు రాకొమారునికిని అనేక విదేశీయులు పరిచయులై యుండిరి. వారందరు ఆతని చావువిని మిక్కిలి చింతించిరి. యువరాజు యువరాణిగారు తమపుత్రుని మరణమునకు వివిధదేశములవారును తెలిపిన సంతాపమునకు వందనము చేయుచు18?2 సంవత్సరము జనవరినెల 20 తేదిన నొకలేఖను ప్రచురించిరి. జనకుని యాజ్ఞప్రకారము విక్టరు రాకొమారునికి మిలిటరీ రాజచిహ్నములతో ఉత్తరక్రియలు జరపిరి. జార్జిరాకొమారుని వారి అన్నగారిమరణమువలన కలిగిన శోకము విశేషకాలము బాధించెను. ఇరువురు నొకరినొకరు యెడబాయక యనేక సంవత్సరములు సముద్రము మీాద సంచారము చేసినందువలన వారి సోదరభావము మఱింత బలపరచబడి ఒకరి నొకరు మిక్కిలి ప్రేమించుచుండిరి. జార్జిరాకొమారుడంతకుమూందే జబ్బుపడినందువలన ఈదుఃఖము వాని మరింత బలహీనునిగాజేసెను. కాని కాలక్రమమున శోకముశమింపగా దేహస్వస్థతగలిగెను.

---

# ఎనిమిదవ అధ్యాయము



మేరీరాకుమారికతో వివాహము.

విక్టరు రాకుమారుని యకాల మరణమువలన జార్జిరాకొమరుని జీవితమంతయు మారవలసివచ్చెను. ఇదివరకు నావికావ్యాపారమె వృత్తిగాజేయ నిశ్చయింపబడినందువలన రాజ్యాంగవ్యవహారముల జార్జిరాకొమారుడేమియు నేర్చుకొనడాయెను. ఇక మీద మున్ముందు తండ్రిగారిసింహాసనము నధిష్ఠించుటకు జార్జిరాకొమారుని యర్హునిగాజేయ తండ్రిగారు నిశ్చయించుకొనిరి. మేరీరాకుమారిక తన భర్తగానిశ్చయింపబడిన వానిమరణమువలన నిర్భాగ్యురాలైతిననియు" ఆంగ్లేయరాజ్యములకు రాణియగుపదవినందు నోము నోచుకొనక పోతినిగదా యనియు పలువిధముల దుఃఖించుచుండెను కాని తన సౌభాగ్యలక్ష్మి తన్నంతక్రూరముగా వదలదని నమ్ముటకాధారము లేకపోయెను. ఇట్లుండ విక్టోరియామహారాణిగారికి జార్జిరాకొమారునకు వివాహముచేయవలెనని కోరిక గలుగ ఆదేవి తమకో

ర్క్లను కుమారునకును కోడలికిని తెలియపరచిరి. శ్రీమేరీ రాకుమారికయొక్క విద్యానైపుణ్యమును గృహకార్యనిర్వహణ కౌశల్యమును బహుభాషా పాండిత్యమును నిరుపమాన రూపలావణ్యమును బాగుగ గుర్తెరిగిన విక్టోరియామహారాణియు ఎడ్వర్డు ప్రభువును అలెగ్జాండ్రా సాధ్వీమణియు ఆంగ్లేయ రాజ్యములకు మహారాణియై ప్రజానురంజకముగను సత్కీర్తిదాయకముగను పాలనజేయుటకు అన్నివిధముల భర్తకు సహకారిణియైయుండుటకు అర్హమైనరాకుమారిక మేరీరాకుమారికయే యని దృఢమనస్కులై యామెగారిని జార్జిరాకొమారునికిచ్చి వివాహముచేయదలంచిరి. మేరీరాకుమారిక 1867 సం॥రం మేనెల 26 తేదిన జననమొందుటచే వివాహకాలమునకు 26 వత్సరములప్రాయంబున నుండెను. ఆయమ శ్రీ ఎడ్వర్డుగారి పెత్తండ్రి కూతురు. ఆంగ్లేయప్రజలు ఆమెను బాల్యమునుండి గుర్తెరుగుదురు. కావుననే ఆమెను విక్టరు రాకుమారుని మరణమువలన సంభవించిన ఆపదను ప్రజలుగూర్చిన పత్రికలయందును సంభాషణలయందును 'జార్జిరాకుమా

రుడు ఈమెనువరించిన బాగుండును' అని చెప్పు చుండిరి. దుఃఖకాలము కొంతయైనను గడవక మునుపే ప్రజలావిధముగ మాటలాడుటకు మేరీ రాకుమారిక అయిష్టపడి "అయ్యో! నన్నేల ఇంత క్రూరముగా నీ దుఃఖ సమయమున బాధించెదరు. రహస్యముగా నాదుఃఖమును కొంతకాలమైనను నేను అనుభవింపరాదా!" అను అర్థమిచ్చు వాక్యములంబల్కెను. కాలక్రమమున ఒకటిన్నర సంవత్సరముకు మేరీరాకుమారికయొక్క దుఃఖము తగ్గెను. జార్జిరాకొమారుడు ప్రజలయొక్కయు, జననీజనకుల యొక్కయు పితామహి యొక్కయు, అభిప్రాయములం గుర్తెరిగి, మేరీరాకుమారిక యొక్క నిరుపమానరూపలావణ్యాది గుణగణంబులచే బద్ధుడై యాకన్యను వరించెను. మేరీరాకుమారికయొక్క తల్లియు తనయల్లుడు కాబోవువాని గుణముల బాల్యమునుండియు గుర్తెరిగినదే గావున యాసంబంధమున కనుజ్ఞయిచ్చెను. తాము కోరినప్రకారము కార్యము నెరవేరెనుగదా యని ఎడ్వర్డు మొదలగువారికిని సంతోషమాయెను.

జార్జిరాకొమారుడిపుడు యువరాజుగారి ప్రథమ పుత్రుడాయెనుగాన వానికి కారన్‌వాల్ ప్రభువు అనియు మరికొన్ని బిరుదులును ప్రభుత్వమువా రొసంగిరి. మేరీరాకుమారిక తనకు ఆంగ్లేయదేశమునందుగల యభిమానమును సూచించుటకై తన పెండ్లియుడుపులన్నియు ఆంగ్లేయ వస్త్రములతో నా దేశముననే తయారుచేయునట్లాజ్ఞ యొసంగెను. జననీజనకులును, విక్టోరియా మహారాణిగారును, మంత్రిసత్తములు మతగురువులతో నాలోచించి 1893 సంవత్సరం జూలై నెల 6 తేదిన వివాహము జరుగునటుల నిశ్చయించిరి. పెండ్లికార్యములు రాచనగరులయందు విరివిగా జరుగుచుండెను. పుర వీధులన్నియు మిక్కిలి వైభవముతో నలంకరింపబడెను. పురజనులందరు వారివారి గృహముల నలంకరించుకొనిరి. పెండ్లిదివసము సమీపించుకొలదిని వివిధపట్టణములనుండి ప్రజలు గుంపులుగుంపులుగా వచ్చుచుండిరి. విదేశసంస్థానాధిపతులు పరివార సమేతులై వచ్చి వారివారి బసలయందు దిగిరి. శ్రీమంతులనేకులు దేశదేశములనుండి రాణిగారి

యాహ్వానము నంగీకరించి వచ్చిరి; హిందూ దేశ ప్రతినిధులును కొందరు సామంతరాజులును వచ్చి యుండిరి. జూలై 6 తేదిన రాజులు శ్రీమంతులు, మంత్రివరేణ్యులు మున్నగు అతిథులందరును, సొగసైన యుడుపులధరించి వివాహమంటపము నలంకరించిరి. విక్టోరియా మహారాణియు అత్యుత్సాహముతో మనుమని కళ్యాణమును వీక్షించుటకై వివాహసమయమునకు చాలాముందుగానే రాచనగరునువదలి వివాహమంటపమునకు విచ్చేసెను. నియమితకాలమునకు జార్జిరాకొమారునికి మేరీరాకొమార్తెకును జయజయధ్వానులమధ్య ఆంగ్లేయాచారములప్రకారము వివాహము జరిగెను. దంపతుల మతగురువులాశీర్వదించిరి. అతిథులందరకును సత్కారములు యథావిధిగ జరుపబడెను. నాటి రాత్రి పురవీథులంతయు దేదీప్యమానముగ రాజిల్లుచుండెను. శుభకార్యమునకై విచ్చేసిన జనులు వీథులుపట్టక తిరుగుచుండిరి ఎటుచూచిన శకటములధ్వని వినబడుచుండెను. నాటిదినము లండను నగరముయొక్క వైభవమింతింతయని చెప్పశక్యము

కాదు. నాటినుండియు జార్జి రాకొమరుడును మేరీ రాకొమారికయు అన్యోన్యప్రేమానురాగంబులు గలిగి వర్ధిల్లుచు సంతోషముగ సంసారసుఖముల్ల ననుభవించుచుండిరి. వివాహానంతరము తండ్రిగారి కార్యములలో జార్జి రాకొమరుడు ఎక్కువశ్రద్ధతో పనిచేయుచు వారికి సహాయకారులుగ నుండిరి. 1893 వ సంవత్సరమున జార్జి రాకొమారుడు కాప్టెన్ పదవికి వృద్ధిజేయబడెను. మేరీరాకుమారిక నూతన దాంపత్యసుఖముల ననుభవించుచు సంసార వ్యవహారముల దిద్దుకొనుచు ఆంగ్లేయప్రజల యనురాగమును బడసి కాలము గడపుచుండెను.



# తొమ్మిదవ అధ్యాయము

## ఆస్ట్రేలియా
## మున్నగు దేశములం దర్శించుట

1894 సంవత్సరమున జార్జి రాకొమారుడు తండ్రి గారితోకూడా రషియా చక్రవర్తియొక్క ఉత్తర క్రియలను చూచుటకు వెళ్లిరి. అవిముగిసిన పిదప క్రొత్తగా సింహాసనారూఢులైన రషియా చక్రవర్తి యొక్క వివాహమును వీక్షించివచ్చిరి. 1897 సం॥ అక్టోబరు నెల 27 తేదిన ప్రిన్సుజార్జి అత్తగారగు టెక్ మహారాణి గతించెను. ఆ దుఃఖవార్త మేరీరా కుమారికకు హఠాత్తుగా తెలిసి ఆమెగారు శోక సాగరనిమగ్నురాలయ్యెను. ఎడ్వర్డుగారును అలె గ్జాండ్రాగారును తక్షణమే కోడలివద్దకు వెళ్లి ఆమె నూరార్చిరి. విక్టోరియా మహారాణిగారి తర్పున ఎడ్వర్డు యువరాజుగారు వెళ్లి టెక్ మహారాణిగారి ఉత్తరక్రియల జరిపివచ్చెను. 1898 సంవత్సరము జూలై నెల 18 తేదిన యువరాజుగారు అంతఃపుర మున మిద్దెమెట్లు దిగుచుండగా వారిమోకాలికి

మంచిదెబ్బతగిలెను. వారికి కాలుకుంటియగునేమో యని జార్జిరాకొమారునికి రాచకుటుంబమువారికిని భయముకలిగెనుగాని నిపుణులైన వైద్యులచికిత్స వలన నేలాటి అపాయము కలుగలేదు. 1901 సం॥ జనవరి మొదటి తారీఖున జార్జిరాకొమారుడు రియర్ అడ్మిరల్ పదవికి వృద్ధిచేయబడిరి. ఆవల కొంతకాలమునకు నావికాసేనలను కర్నల్ యిన్ ఛీఫ్ అను గొప్పయుద్యోగమునకు వారు నియమింప బడిరి. ఈసంవత్సరము రాచకుటుంబము వారికే గాక ఆంగ్లేయరాజ్యమునకంతయు గొప్పదుఃఖము సంభవించెను. 1901 సంవత్సరం జనవరి 22 తేదిన శ్రీమద్విక్టోరియా మహారాణిగారు పరలోక గతు రాలయ్యెను. ఈదుఃఖవార్త ఆంగ్లేయరాజ్యము లకు తెలియగా ప్రజలెల్లరు మిగుల దుఃఖించిరి. తల్లిగారి మరణముచే ఎడ్వర్డురాజు శోకముతో నిండియున్నప్పటికిని రాజకీయవ్యవహారములు జరుగ వలసియుండునుగాన తక్షణమే మతగురువులు వారిని రాజ్యాభిషిక్తునిగ జేసిరి. ఎడ్వర్డురాజు తల్లిగారికి ఉత్తరక్రియలు జరిపి, కాలక్రమమున దుఃఖమును

చల్లార్చుకొని రాచకార్యములు విచారించుకొనుచుండిరి. విక్టోరియా మహారాణిగారి మరణమైన కొద్దిరోజులకు జార్జిరాకొమారునికి జబ్బుచేసి సప్తమ ఎడ్వర్డు చక్రవర్తిగారి మనస్సుకు చాలా ఆయాసమును కలుగజేసెనుగాని త్వరలోనే జార్జిరాకొమారునికి దేహస్వస్థత కలిగెను.

విక్టోరియా మహారాణిగారు గతించుటకు పూర్వమే ఆస్ట్రేలియాలో న్యూసౌత్ వేల్సు, విక్టోరియా, సౌత్ ఆస్ట్రేలియా, టాస్మేనియా, వెస్టరన్ ఆస్ట్రేలియా అను భాగముల నొకటిగాజేర్చి ఫెడరల్ కామన్వెల్తు అనుపేరుతో ఆదేశ పరిపాలనావిషయముల వారి కధికారముగల యొకసభను ఏర్పాటుచేసి 1900 సంవత్సరం సెప్టంబరు నెల 18 తేదిన రాయల్ప్రొక్లమేషన్ శ్రీవిక్టోరియా మహారాణి సాదరుచేసియుండిరి. ఆసమయముననే విక్టోరియా మహారాణిగారు ప్రథమ ఆస్ట్రేలియా పార్లమెంటు సభను తనపౌత్రుడు జార్జిరాకొమారుడు వెళ్లి ప్రారంభించిరావలయునని అభిప్రాయపడిరి. ఇంతలో రాణిగారు గతించిరి. కాని రాచకుటుంబమునకు స్వయ

ముగా సంభవించు ఆపదలుగాని దుఃఖములుగాని ప్రజాపరిపాలనా విషయములకు లేశమాత్రమైనను లోపము కలుగజేయరాదనెడి అనాదిగా ఆచరింపబడు ఆంగ్లేయరాజులనీతిని, సప్తమ ఎడ్వర్డు చక్రవర్తిగారును విడువకుండ ఆచరింపదలంచి, తమ తల్లిగారి కోర్కెప్రకారము జార్జిరాకొమారుడు ఆస్ట్రేలియాదేశమునకు జని విధాయకకృత్యమును నెరవేర్ప యాజ్ఞనొసగిరి. ఈప్రయాణమువలన జార్జిరాకొమారుడును, మేరీరాకొమారికయు తమచిన్నబిడ్డలవదలి విశేషకాలముండవలసినట్లు తటస్థించినందులకు మనోవ్యాకులతనొందిరి. కాని జార్జిరాకొమారుడు తన విధ్యుక్తధర్మమును నెరవేర్చుటయందు మిక్కిలి పట్టుదలగలవాడు గావున ధైర్యము తెచ్చుకొని తనభార్యకు ధైర్యముచెప్పి యామెను వెంటబెట్టుకొని ప్రయాణోన్ముఖులైరి. 1901 సం॥ మార్చినెల 16 వ తేదిన రాజదంపతులు పోర్ట్సుమత్ రేవువద్ద పొగయోడనెక్కి జిబ్రాల్టరు, ఏడన్, కొలంబో అనుప్రదేశములమీదుగా ఆయాస్థలములలో ప్రజల స్వాగతములనంది సంతోషించుచు

మేనెల 6 తేదికి మెల్బోర్నను పట్టణమునకు చేరిరి. ఇచ్చటనే వారు ప్రథమనూతన ఆస్ట్రేలియా మహా సభను ప్రారంభింపవలసినది గాన ఆపట్టణమంతయు మిక్కిలి సుందరముగా నలంకరింపబడి శ్రీవార్లకై యెదురుచూచుచుండెను. వివిధ పట్టణములనుండి సుమారు లక్షమంది ప్రజలు నాటిదినమక్కడ సమావేశమైయుండిరి. నియమితకాలమునకు ప్రథమ ఆస్ట్రేలియా ఫిడరల్ పార్లమెంటు మెల్బోర్ను పట్టణమున సమావేశమయ్యెను. రాజదంపతులు రాజసన్మానములతో నా సభాభవనమునకు విచ్చేసి ఉన్నతాసనముల నలంకరించిరి. ప్రథమమర్యాదలన్నియు యథావిధిగ జరిగినతర్వాత జార్జిరాకొమరుడు లేచి మృదుమధురవచనములతో నొకచిన్న యుపన్యాసమిచ్చి తమతండ్రిగారి యానతి ననుసరించి పార్లమెంటు ప్రారంభించుట కాజ్ఞయిచ్చితినని నెను. తక్షణమే కరతాళధ్వనులును, వివిధవాయిద్యములును మ్రోగి ప్రజల యుత్సాహమును తెలియపరచెను. మేరీరాకొమారిక తమమామగారికి 'తాము నియమించిన కార్యమును మిక్కిలి జయప్రదముగ నెర

వేర్చితిమి' అని తంతివార్తనంప ఆజ్ఞయిచ్చెను. జార్జిరాకుమారుడు తమ తండ్రిగారు నాటిదినము పంపిన వర్తమానమును 'ఈముఖ్యదివసమున నా హృదయమంతయు మీయందే యున్నది. ఆస్ట్రేలియా మహాసభకు అభ్యుదయమును సౌఖ్యమును కలుగుగాక యని నామనఃపూర్వకమునైన కోరిక' అని చదివిరి. సభ్యులందరు కరతాళధ్వనులచే వారి సంతోషమును తెలిపిరి. అంతటితో నాటి సభ ముగిసెను. తర్వాత రాజదంపతులు వారియుత్సాహమునకై యేర్పాటుచేయబడిన వివిధవినోదములం జూచుచు కొన్ని దినములు గడపిరి. ఆస్ట్రేలియనుల రాజభక్తిని వారనేకవిధముల గమనించి సంతోషించిరి. రాజదంపతులు మెల్బోరన్ వదలి, బ్రిస్బేన్, శిడ్నే పట్టణములమీదుగా జూన్ నెల 12 తేదిన న్యూజీలెండ్ జేరిరి. న్యూజీలెండ్ లోని ముఖ్యపట్టణములను దర్శించుచు వారు 15 రోజులు గడపి జూన్ నెల 27 తేదిన టాస్మేనియాకు పయనమైరి.

టాస్మేనియా ముఖ్యపట్టణము హోబార్టు. అక్కడ రాజదంపతులు నాలుగురోజులుండి ప్రజ

లచే గౌరవింపబడి అడిలేడీ అను పట్టణమునకు వెళ్లిరి. అక్కడ యూనివర్సిటీవారు జార్జిరాకొమరునికి యల్. యల్. డి అను ఘనమైన బిరుదు నొసంగి గౌరవించిరి. వారు ఆపట్టణమును వదలి, ఫ్రిమేంటిల్, మోరిషస్ మీదుగా ఆగస్టు నెల 13 తేదిన డర్బాన్ రేవు చేరిరి. ఆసమయముననే దక్షిణ ఆఫ్రికాలో యుద్ధము జరిగియుండెను; కావున రాజదంపతులు అచ్చటికి వెళ్లుట పొరబాటనియు, ఓడిపోయిన ప్రజలింకను రోషోద్దీపితులై యున్నారుగాన రాచవారికి కపాయము జరుగునేమోయనియు ఆంగ్లేయప్రజలు తలంచిరి కాని సప్తమ ఎడ్వర్డు చక్రవర్తిగారు తనకుమారుని నైపుణ్యమును బుద్ధిసూక్ష్మమును బాగుగ గుర్తెరిగినవారగుటచే, తన కుమారుడు చక్కగానడచుకొని లోపములేకుండ జరుపునని దృఢనిశ్చయులై యుండిరేగాని వారికేమాత్రము భయము కలుగలేదు. యుద్ధక్షేత్రములుగనుండిన కేప్‌కాలొని, నేటాల్ దేశములలో జార్జిరాకొమారునికిని మేరీరాకొమారికకును ప్రజలుజరపిన స్వాగతోత్సవములు ఇతర దేశములలో జరిగినవానికంటె

అతిశయముగానుండి జార్జి రాకొమారుని నేర్పరితనమును స్పష్టపరచెను. వారి ఆగమనమువలన ఉభయ పార్శ్వముల వారిరోషములు కొంచెము తగ్గెను. వారచ్చటనుండువరకు ప్రజలు అన్నికలహములను మరచిరి. కేప్ టౌన్ యూనివర్సిటీవారు జార్జిరాకొమారుని ఛాన్సెలర్ గా నెన్నుకొని గౌరవించిరి. ఈవిధముగ రాజదంపతులు దక్షిణ ఆఫ్రికాలో జయప్రదముగా యాత్రసలిపి ప్రజలచే మెప్పొంది ఆంగ్లేయప్రజల భయములు నిరాధారములుగ జేసి ఆగస్టు 23 తేదిన సౌమన్సుబె వదలిచనిరి. అచ్చట బయలుదేరినది మొదలు మధ్య నెచ్చటనుదిగక శెప్టెంబరునెల 16 తేదిన క్వీబెక్ పట్టణమునుచేరి కనడాదేశమును దర్శింప రాజదంపతులు బయలుదేరిరి. అపుడు మింటోప్రభువు కనడాదేశమునకు గవర్నరుజనరలుగానుండిరి. ఆయన రాజదంపతుల నెదుర్కొని అర్హమైన స్వాగతమొసంగెను. రాచకుమారుని గౌరవించుటకై కనడా దేశీయులు పురము నలంకరించి, గుంపులుగుంపులుగా శ్రీవార్ల నెదుర్కొని, సభచేసి, విన్నపపత్రికను చదివిరి

శ్రీజార్జిరాకొమారుడు తగిన ప్రత్యుత్తరమిచ్చి వారిని సంతోషపరచెను. లా వా ల్ యూనివర్సిటీవారు జార్జిగారికి డాక్టరు ఆఫ్‌లాస్ అను బిరుదునొసంగిరి. మాంట్రీలు పట్టణమునందును రాజదంపతులు కొంతకాలముండి ప్రజల మర్యాదల నంగీకరించిరి. అచ్చట మెజిల్ యూనివర్సిటీవారు రాయల్ విక్టోరియా కాలేజిలో సభచేసి రాజదంపతు లిరువురకు డాక్టర్ ఆఫ్‌లాస్ అను బిరుదునిచ్చిరి. ఈ కాలేజి స్త్రీవిద్యకై మాత్రమే స్థాపింపబడినదిగాన శ్రీమేరీ రాణిగారికిని సహా వారుబిరుదిచ్చి గౌరవించుట ఎంతయు సమంజసముగనున్నది మరియు యామె గారికిదియే ప్రథమ బిరుదుగావున నీ విషయము ముఖ్యమైనది. అక్కడనుండి రాచదంపతులు ఒటావామీదుగా శెప్టంబరునెల 26 తేదికి మానిటోబా ముఖ్యపట్టణమగు వి ని పె గ్ పట్టణమును జేరిరి. అక్కడ శ్రీవారు మానిటోబా యూనివర్సిటీని నూతనముగా ప్రారంభించిరి. అక్కడినుండి నాటి రాత్రిబయలుదేరి వారు కాల్గరీ, వాం కో వ ర్, టొరంటో మున్న గుపట్టణములందర్శించి హాలిఫాక్సు

చేరిరి. శ్రీవార్ల నెదుర్కొనుటకై, జార్జిరాకొమా రుని జననీజనకులు, తమ మనుమలు మనుమరాం డ్రనుతోడ్కొని వచ్చిరి. నాటికి సుమారు యెని మిదినెలల క్రిందట వదలిపోయిన తనబిడ్డలచూచు టకై మేరీరాకుమారిక మనస్సుపరితపించుచుండెను. బిడ్డలును జననీజనకులజూడ తొందరబడుచుండిరి. జార్జిరాకొమారుని యోడ సమీపించగనే, అంద రును కలసికొని రాచకుటుంబమువారొకరినొకరు యాలింగనముజేసికొని, కుశలముల తెలుపుకొని, అందరును రాచనగరునకరిగిరి. ఈయెనిమిదినెలలో రాజదంపతులు 45 వేల మైళ్లు ప్రయాణముసలిపి అయిదుఖండములను దర్శించివచ్చిరి.



# పదియవ అధ్యాయము

## యువరాజై జనకునివద్ద రాచకార్యముల నేర్చుట

ఆంగ్లేయ రాజులయొక్క ప్రథమ పుత్రునకు వేల్సురాజు అనిపేరు. వీరే తండ్రితదనంతరము రాజ్యాధిపత్యమునందఁట కర్హులు. సప్తమ ఎడ్వర్డు చక్రవర్తిగారు 1901 సం॥ నవంబరునెల 9 తేదిన జార్జికొమరుని యువరాజుగా నియమించి వేల్సు ప్రభువునకుగల బిరుదులన్నియు నిచ్చిరి. ఆపల నెల రోజులకు గిల్డుహాలునందు లండనుపురవరులు యువరాజు యువరాణిగార్లకు స్వాగతమిచ్చుటకై గొప్ప సభజేసిరి. ఆసభయందు జార్జియువరాజుగారు ఘనమైన యుపన్యాసమిచ్చి ఆంగ్లేయప్రజల మనముల నాకర్షించెను. వారు ఆయాదేశములలో జూచిన ముఖ్యాంశముల జెప్పి, ప్రతిదేశమందును ప్రజలు రాజభక్తిని మాతృదేశమందలి ప్రేమను గలవారనియు తమకొసంగిన ఆతిధ్యములను మెచ్చుకొనుచు, స్వదేశీయులు అన్యదేశములకువెళ్లి వారి వ్యాపార

ములయందు ధనమూలమునకు సలహామూలమునకు మిక్కిలి సహాయులుగానుండినయెడల మాతృదేశమునకును సామంతరాజ్యములకును ప్రేమానుబంధములు బలకరములగుననియు నొక్కి చెప్పిరి. జార్జి రాకొమారుడు యువరాజైనందుకుగాను సంతోషమును తెలుపుచు మరికొన్ని సభలు వేడుకలు ఇంగ్లాండులో జరిగెను. తదనంతరము యువరాజుగారు తండ్రిగారివద్ద రాజ్యవ్యవహారముల నేర్చుకొనుచు తండ్రిగారికి సహాయ్యులై యుండిరి. 1902 సంవత్సరము ఫిబ్రవరినెల 6 తేది యువరాజుగారు లండను రాయల్ సొసైటీలో సభ్యులుగా జేర్చుకొనబడిరి. వారికి ప్రకృతిశాస్త్రములయందెక్కువ అభిలాష కలదుగావున ప్రకృతిశాస్త్రముల మూలమున వాణిజ్యాభివృద్ధినొందుటకు సదుపాయముల వెతకుచుండవలయునని ప్రజలకు బోధించుచుండెడివారు. 1902 సంవత్సరము జూన్ నెలలో సప్తమ ఎడ్వర్డు చక్రవర్తిగారి పట్టాభిషేక మహోత్సవము జరుగునటుల నిశ్చయింపబడెను; కాని అకస్మాత్తుగా ఎడ్వర్డు రాజుగారికి అపాయకరమైన

వ్యాధి తగిలి ప్రజలకును రాచకుటుంబమునకును ఆయాసము కలిగించి పట్టాభిషేకము నిలుపునట్లు జేసెను. సప్తమ ఎడ్వర్డురాజుగారి పట్టాభి షేకమునకై సకలమైన యత్నముల జేసికొని సిద్ధముగనున్న ప్రజలకోర్కెలకు భంగము కలుగజేసి తినిగదా యని మిక్కిలి చింతించిరి. కాని ప్రజలు రాజుగారికి త్వరలో దేహారోగ్యము కలుగవలెనని దేవుని ప్రార్థించి, తమప్రార్థనల దేవుడాలకించినందులకై మిక్కిలి వందనములాచరించి సంతోషించిరి. తర్వాత ఎడ్వర్డు చక్రవర్తిగారి పట్టాభిషేక మహోత్సవమును యథావిధిగ జరిగెను. జార్జి యువరాజుగారు సేనలో జనరల్ అను గౌరవమునుబొందిరి. ఆవల మూడు సంవత్సరములు యువరాజుగారు ఇంగ్లాండునందేయుండి అప్పుడప్పుడు రాజుగారి తరఫున కొన్ని ముఖ్యసభలకుబోవుచు వ్యవసాయ కార్యముల నెక్కువశ్రద్ధతో విచారించుకొనుచు సుఖముగ కాలము గడపుచుండిరి. ఇట్లుండగా, తండ్రిగారు తన కుమారుడు హిందూదేశమును దర్శించుట ముఖ్యమని తలంచి పంప నిశ్చయించు

కొనిరి. యువరాజుగారు బాల్యమునుండిచేసిన సంచారములలో అన్ని ఖండములకును వెళ్లి ముఖ్య దేశము లనేకములు చూచియుండిరి గాని భరత ఖండమునకుమాత్రము రాలేదు. కాబట్టి తండ్రి గారి తీర్మానము జార్జియువరాజుగారికిని సంతోషావహముగ నుండెను. ఇదివరలో ఎడ్వర్డు చక్రవర్తి గారు యువరాజుగానుండినపుడు భరతఖండమును దర్శించిరి; కాని వారొంటరిగా వచ్చిరేగాని కళత్ర సహితముగ రాలేదు. ఇపుడు జార్జియువరాజుగారు తమ సతీమణియును హిందూదేశమును వీక్షించి భారతీయుల శుభాశుభముల స్వయముగ గమనించుట మంచిదనితలచి యామెగారిని తోడ్కొని హిందూదేశమునకుబోవ నిశ్చయించుకొనిరి. మేరీ యువరాణిగారును పుత్రపుత్రికలవదలి చాలాకాలము గడపవలయునేయ నెడి మనోవ్యథబాధించుచున్నను భారతీయులయెడగల తమ యనురాగమును గనబరచుటకై భర్తగారితో పయనముగుటకు సంసిద్ధురాలయ్యెను.

---

# పదునొకండవ అధ్యాయము

యువరాజుగా హిందూదేశమును దర్శించుట

రాజదంపతు లిరువురు 1905 సంవత్సరము అక్టోబరునెల 19 తేదిన లండను నగరమునువదలి రినాన్ అను పొగయోడనెక్కి భరతఖండమునకు పయనమైరి. ఆపొగయోడ మిక్కిలి త్వరితముగా పోవునట్లుగను, అందు రాజదంపతులకు ఆవశ్యకమగు సౌకర్యములన్నియు కలుగునట్లుగను యేర్పాట్లుచేయబడెను. దానినెక్కి వారు నవంబరునెల 9 తేది బొంబాయిరేవు చేరిరి. వారి నెదుర్కొనుటకై తత్కాలపు ఇండియాగవర్నరుజనరలుగారైన లార్డుకర్జనుగారు కొంత పరివారముతో గవర్నమెంటు స్టీమరులో నెక్కి రినాన్ స్టీమరువద్దకువెళ్లి యువరాజు యువరాణిగార్లను తోడ్కొని నాటి సాయంకాలము 4 గంటల 5 నిమిషములకు అపోలోబందరు అనురేవుకు వచ్చి దిగిరి. రాజదంపతులకు స్వాగతమిచ్చుటకై యారేవుకడ నొకదివ్యమైన మంటపము నిర్మింపబడెను. రాజదంపతులు గొప్ప

ఆఫీసర్ల పరివారముతో మంటపములోనికి విచ్చేసి యున్న తాసనముల నధిష్ఠించిరి. అంతట బొంబాయి పురపారిశుద్ధ సంఘమువారి తరఫున సర్ ఫిరోజషా మెహతాగారు రాజదంపతులకు స్వాగతమిచ్చుచు విన్నపపత్రికను, మెహతాగారి సహజమగు గంభీర కంఠస్వరముతో, చదివిరి. యువరాజుగా రందుకు తగిన వాక్యములతో జవాబిచ్చి 'హిందూదేశీయులు దయార్ద్ర హృదయులనియు, రాజభక్తి, విశ్వాసము గలవారనియు, మర్యాదవంతులనియు, ధైర్యస్థైర్యముగలవారనియు, చిన్ననాటినుండి నేను చదివి విని యున్నాను.' అని చెప్పిరి. అంతట శ్రీవారు జయజయధ్వనులమధ్య లేచి ఊరేగింపుతో గవర్నమెంటు హౌసుకు పోయిరి. మరుసటిరోజు శ్రీవారు స్వదేశరాజులకు కొందరికి దర్శనమిచ్చి బొంబాయివీధుల గొన్ని తిలకించిరి. నాటిరాత్రి బొంబాయి గవర్నరుగారి బంగళాలో శ్రీవారికి గొప్పవిందు జరిగెను. యువరాజు యువరాణి గార్లకు విందారగించ నర్హులగు సుమారు నాలుగు వందలమంది గొప్ప ఉద్యోగియులు, సంస్థానాధి

పతులు, ఘనముఖులగు ప్రజానాయకులుమాత్రమే ఆవిందున కాహ్వానము చేయబడిరి. మరునటిరోజు శ్రీవారు బొంబాయి వస్తుప్రదర్శనశాలకు శంఖుస్థాపన చేసిరి. 12 తేదిన ఆదివారమగుటవలన శ్రీవారు విశేషకార్యములు పెట్టుకొనక సాయంత్రము క్రీస్తుదేవాలయమునకు వెళ్లి ప్రార్థనసలిపిరి. 13 తేదిన స్వదేశరాజుల బంగళాలకు వెళ్ళి వారింజూచివచ్చిరి. హిందూదేశీయస్త్రీలు యువరాణిగారిని మర్యాదచేయుటకై సభచేసి విన్నపపత్రికను చదువగా, మేరీరాణిగారు కుతూహలమంది వారుచేసిన మర్యాదలకు స్త్రీజనసమూహమునకు వందనముచేసిరి. 14 తేదిన రాజదంపతులు బొంబాయిసమీపముననున్న సుందరమగు ఎలిఫెంటు గుహలను జూడబోయిరి. 15 తేదిన రాత్రి శ్రీవారు పురజనుల సంతోషవాద్యములమధ్య బొంబాయి నగరమునువదలి ఇండూరునకు పోయిరి. అక్కడ ఇండూరు మహారాజుగారి సత్కారములంగైకొని 17 తేదిన రైలుస్టేషను సమీపములో గట్టబడిన ఎడ్వర్డు హాలునకు ప్రథమప్రవేశము జరిపి నాటి

రాత్రి ఇండూరు బయలుదేరి రాజదంపతులు 18 తేది ఉదయము ఉదయపురము జేరిరి. అక్కడ పడవలో ఫరుఖ్‌సాగరు సరస్సునందు ఇంచుక సేపు విహరించి, తోటలు మొదలగు ముఖ్యస్థలములం దర్శించి యథావిధిగ ఉదయపుర మహారాజుగారి సత్కారములంగైకొని 20 తేదినాడు పిచాలా సరస్సువద్ద వేటాడిరి. 20 తేది సాయంత్రము శ్రీవారు ఉదయపురమువిడిచి, మరునాడుదయము నకు జయపురము జేరిరి. జయపురము మహారాజా గారి సత్కారములనంది శ్రీవారు 24 తేది బికానీరు చేరిరి. శ్రీవారక్కడ నాలుగురోజులుండి వేటలు, విందులు, ఉత్సవములు యథావిధిగజరపి 28 తేదిన బికానీరు వదలిరి. భటిండస్టేషనువద్ద శ్రీవారు కొంచెము సేపునిలచి లాహోరుకుపోయిరి. డిసంబరు నెల 1 తేదిన యువరాజుగారు లాహోరు నూతన యూనివర్సిటీహాలునకు ప్రథమ ప్రవేశ మహోత్సవమును జరపిరి. తర్వాత శ్రీవారు పెషావరుకు పోయిరి. అక్కడ మునిశిపాలిటీ వారి విన్నప పత్రిక నంగీకరించి ప్రత్యుత్తర మిచ్చుటలో

"హిందూదేశము యొక్క ఆయుధపాణి యను బిరుదును పాంచాలదేశమునకు కలుగజేసిన శూర వరుల త్వరలో మేము వీక్షించుసమయము కలుగునని మిక్కిలి కోరుచున్నాము. లాహోరు నగరము సైనికులకు పెంపుడుస్థలమువంటిదని చెప్ప వచ్చు" అను మొదలగు వాక్యముల గుప్పించి ప్రజల సంతోషపరచిరి. 4 తేది వుదయము శ్రీవారు కైబరుపాస్ చూచుటకై బయలుదేరిరి. శీతలప్రదేశములగుటచేతను, చలివిశేషముగానుండు కాలము గావునను, శ్రీవార్ల కాప్రయాణమించుక అసాఖ్యముగా నుండెను. జంరద్ కోట, లండికొటాల్ అను కోటలను శ్రీవారు దర్శించిరి. త్రోవనంతయు అచ్చటచ్చట సేనలపరివారములునిలచి మార్గమున అపాయములు జరుగకుండ రక్షించుచుండిరి. శ్రీవారు కైబరుపాస్ చేరి చుట్టుప్రక్కలనుండు సుందరమగు ప్రదేశములంజూచి సంతోషించిరి. అక్కడ నుండి తిరిగి పెషావరుకువచ్చి వారు లాహోరు నందుచూడగోరిన యుద్ధభటుల 65 వేలమంది నచ్చట పరీక్షించిరి. ఈసేనలవలన వినోదముగా యుద్ధ

వ్యూహములు కొన్ని జరపబడెను. తర్వాత శ్రీ వారు రావల్‌పిండిచేరి. అక్కడ సేనలను పరీక్షించి ప్రజలస్వాగతములనంది డిసంబరు 8 తేది సాయంకాలము కాశ్మీరమహారాజుగారి దేశమున వారు 3 రోజులుండి అమృత సరస్సుమీదుగా 12 తేదిన ఢిల్లీనగరము జేరిరి. ఢిల్లీలో చాండిచౌక్ మధ్య వేయబడిన సురుచిర మంటపమున శ్రీవార్లు ఢిల్లీ మునిసిపాలిటీవారిచిన్న పపత్రిక నంగీకరించిరి. ప్రత్యుత్తరమున యువరాజుగారు " ఈపురాతనమగు పట్టణము నెపుడు చూతుమాయని నేను నాసతీ తిలకమును తొందరపడుచుంటిమి. ఢిల్లీయొక్క పూర్వ చరిత్రము నాలోచించినను భావిచరిత్రము నాలోచించినను ఆశ్చర్యముకలుగుచున్నది. ఈ రాజ్యములో ఢిల్లీకిగల గౌరవమును మేము, మాసంతతి వారు కాపాడుచుండవలయునని మీరు కోరుచున్నారు " అని చెప్పిరి. ఢిల్లీపట్టణమునగల పురాతనకట్టడములును ప్రసిద్ధికెక్కిన స్థలమునగు కుత్బుమినార్, హుమాయుడ్ గోరి, సాల్‌బట్ జంగ్ గోరి మొదలగునవి ప్రాచీన మహమ్మదీయుల శిల్పకళా

కౌశల్యమును మెచ్చుకొనిరి. డిసంబరు 15 తేది రాత్రి శ్రీవారు ఢిల్లీలో బయలుదేరి 16 తేది ఆగ్రాపట్టణమును జేరిరి. అక్కడ టాజ్ మహల్ మొదలగు సుప్రసిద్ధస్థలముల దర్శించి శ్రీవారు 20 తేది గ్వాలియరు చేరిరి. గ్వాలియర్ మహారాజుగారు శ్రీవార్లకు స్వాగత మొసంగుటకై చేసినంత ఘనముగా ఏర్పాటులు మఱియేసంస్థానాధిపతియు చేయలేదని చెప్పబడినది. విశేషద్రవ్యమును వెచ్చించి గ్వాలియరు పట్టణమంతయును, ముఖ్యముగా రాజమార్గమును మిక్కిలి రామణీయకముగను అద్భుతముగను అలంకరించిరి. శ్రీవార్లును, మహారాజుగారును పట్టపేనుగులనెక్కి రాజభవనమునకు విచ్చేసిరి. అక్కడ గొప్పదర్బారు జరపిరి. ఆదర్బారు హాలుయొక్క వైభవము ఇంగ్లాండులోనుండు సెంట్ జేమ్సు హాలు, వెస్టుమినిస్టరుహాలు అను ఘనతమమైన రాజసభామందిరముల తులదూగుచుండెను. రాజదంపతులాపట్టణమున వేటలుసలిపి, విందులారగించి వివిధవినోదములంజూచి, లక్నో పట్టణమునకు బయలుదేరిరి. వారు 26 తేది లక్నో చేరిరి. అక్కడ ప్రజల

సత్కారములంగైకొని, తత్కాలపు హిందూదేశ ముఖ్యపట్టణమును రాజప్రతినిధిగారి నివాసస్థలమును నగు కలకత్తానగరమునకు 29 తేదిన చేరిరి. రాజప్రతినిధివాసస్థానమును ప్రపంచమునందలి పట్టణములలోనెల్ల లండను నగరమునకు తర్వాత గొప్ప పట్టణమును, తేజోనిధులును ధర్మనిరతులునగు ప్రజలకాలవాలమును, అయిన ఆ మహానగరమునందెంత వైభవముతో రాజప్రతినిధులకు స్వాగతమియ్యవలయునో, అందుకు ఇసుమంతయేనియు లోపములేకుండ జరుగబడెను. ఇదివరకు ఆంగ్లేయ రాణిగారెవరును హిందూదేశమును దర్శించియుండనందున మేరీరాణిగారు భారతీయులనాదరించుటకై భరతఖండమునకు విచ్చేసినందుకు తమ సంతోషమును తెలుపుచు కలకత్తాపురపాలన సంఘమువారు నవరత్నహారమొకటి యువరాణిగారికి బహుమతియొసంగిరి రాజదంపతులు కలకత్తానగరమునందు ఎనిమిదిరోజులు నివసించిరి. 1906 సంవత్సరము జనవరినెల 5 తేదిన కలకత్తా యూనివర్సిటీవారు గొప్ప సభజేసి యువరాజుగారికి డి. సి. యల్ అనే

బిరుదునొసంగి సన్మానించిరి. శ్రీవార్లు కలకత్తా ప్రజల రాజభక్తికి మెచ్చుకొని 13 తేది రంగూనుకు పోయిరి. అక్కడ నేనుగుల వేడుకలు మొదలగు నవి చూచి, శ్రీవారు 16, 17, 18, తేదులలో మాండలే పట్టణమున ప్రజల సత్కారములనంది 24 తేదిన మదరాసు రేవులో దిగిరి. రేవువద్ద గొప్ప మంటపము నిర్మింపబడి చిత్రవిధముల నలంకరింప బడెను. శ్రీవార్లందు ఉన్నతసింహాసనముల నధిష్ఠించగా చెన్నపురి పురపాలనాసంఘమువారి తరఫున తత్సభాధ్యక్షులగు పియర్సు దొరవారు విజ్ఞాపన పత్రికను చదువగా యువరాజుగారందుకు ప్రత్యుత్తరమిచ్చుచు "మీ రాజభక్తిని మిగుల త్వరలో మాతండ్రిగారికి విన్నవించెద" ననిరి. అంతట రాజ సన్మానములతో మదరాసు గవర్నరుగారి బంగళాకు జనిరి, అపుడు మదరాసు గవర్నరుగారగు లార్డు ఆంప్తిల్‌గారు యువరాజు యువరాణిగార్లకు తగు మర్యాదతో తన బంగళాయం దాతిథ్యమిడిరి. శ్రీ వార్లు చెన్నపురిలో 24, 25, 26, 27, 28, తేదు లలో ననేకముఖ్యస్థలములను జూచియు, ప్రజానా

యకులకు దర్శనమిచ్చియు, తోటవిందులనందియు, విక్టోరియా మెమోరియల్ భవనముకు శంఖుస్థాపన మొనర్చియు, చెన్నపురి ప్రజలసంతోషపరచి, జనవరి నెల 28 తేది రాత్రి చెన్నపురి బయలుదేరి మైసూరునకు వెళ్లిరి. అక్కడ మైసూరు మహారాజుగారు, బ్రిటిష్ రెసిడెంటు మున్నగు ప్రముఖులనేకులు శ్రీవార్ల నెదుర్కొని గౌరవించి జగన్మోహనమందిరమున దించిరి. మరుసటిరోజు శ్రీవారు చామరాజేంద్ర టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ అను పరిశ్రామికపాఠశాలకు శంఖుస్థాపనము జేసిరి. ఆవల శ్రీరంగపట్టణమును దర్శించి, మరల మైసూరుకు వచ్చి ఫిబ్రవరి నెల 5 తేదిన బెంగుళూరుకు వెళ్లిరి. అక్కడ రెండురోజులు నివసించి 7 తేదిన శ్రీవార్లు హైదరాబాదుకు ప్రయాణమైరి. నైజాంగారును, ప్రధానమంత్రియు, గొప్ప ఉద్యోగీయులును బ్రిటిష్ రెసిడెంటుగారును శ్రీవార్ల నెదుర్కొని స్వాగతమిచ్చి ఫలక్‌నామాభవనమునకు తోడ్కొనిపోయిరి. అచ్చట దర్బారులు విందులు మొదలగు సన్మానముల నంది శ్రీవారు హైదరాబాదుకు ఆరుమైళ్లదూర

ముంలోనున్న శికంద్రాబాదునందు సేనల పరీక్షించుటకై వెళ్లిరి. మార్గమధ్యమున హుసేన్‌సాగరు సరస్సును చూచిరి. శికంద్రాబాదుచేరి శ్రీవార్లు సేనల బరీక్షించుచుండిరి. నాటిదినము నైజాంగారికి గొప్పవిపత్తు సంభవించెను. నైజాంగారి కుమార్తెయగు 23 సంవత్సరముల ప్రాయముగల యువతీమణి జబ్బుపడి నాటిదినమే మరణించెనను శోకవార్త శ్రీవార్లకు తెలియవచ్చెను. అంతట శ్రీవార్లు హైదరాబాదుకు వెళ్లి దుఃఖసాగర నిమగ్నులైయున్న నైజాంగారిని నూరడించి తమ సానుభూతిం తెలిపి 16 తేది హైదరాబాదువదలి కాశీపట్టణమునకుబోయిరి. మార్గమధ్యమున ఎల్లోరాయందుండు సుందరమగు రాతి దేవాలయములం జూచి శ్రీవార్లు సంతోషించిరి. కాశీలో శ్రీవార్లు నాలుగురోజులుండి ప్రజలసత్కారములనంది గ్వాలియరుమీదుగా ఆలిఘురుకుపోయిరి. అక్కడ ఆలిఘురు కాలేజిమున్నగు ముఖ్యప్రదేశములజూచి, మార్చినెల 7 తేదికి రాజప్రతినిధిగారి వేసవికాల నివాసస్థలమగు సింలాపట్టణమునకు జేరిరి. అక్కడ

నుండి 9 తేది బయలుదేరి 12 తేదిన క్వెట్టా జేరిరి. అచ్చట గొప్ప దర్బారు జరుపబడెను. ఆపట్టణమున నాలుగురోజులుండి 17 తేదిన గొప్ప రేవుపట్టణ మగు కరాచీ పట్టణమున రాజదంపతులు చేరిరి. అక్కడ పురపారిశుధ్య సంఘమువారియొక్క విన్నప పత్రికనందిరి. హిందూదేశయాత్ర జయప్రదముగ సంపూర్ణముగావించి మాతృదేశమునకు బయలు దేరు కడపటిస్థానముగావున అచ్చట శ్రీజార్జియువ రాజుగారు ప్రత్యుత్తరమిచ్చుటలో తమకు భారతీయు లొసగిన స్వాగతమహోత్సవములకును, వారిరాజభక్తికిని తమ సౌకర్యమునకై వివిధ స్వదేశ సంస్థానాధిపతులును ప్రజానాయకులును, సర్కారు నౌకర్లునుచేసిన యేర్పాటులకును మర్యాదలకును, తమ కౌతూహలమును వందనములను తెలిపిరి. మఱియు హిందూదేశప్రజలయొక్క సౌఖ్యము, అభ్యుదయము, తమ మనములయందు సర్వదా స్థిరముగా నాటుకొనియుండి తామేయేవిధముల తత్తార్యార్థసిద్ధికై సహాయ్యమొనర్చుట కవకాశము గలుగునో అట్టి సమయములలో లోపము లేక

సహాయపడుదు మరియు శ్రీజార్జి యువరాజుగారు వక్కాణించిరి. శ్రీవార్ల - ప్రత్యుత్తరవచనములు భారతీయులందరకును సంతోషావహముగ నుండెను. శ్రీరాజదంపతులు కరాచీపట్టణమున శ్రీవిక్టోరియా మహారాణిగారి ప్రతిమను బయలుపరచిరి. అక్కడనుండి శ్రీవారు మార్చి 19 తేదిన హిందూ దేశమును విడచుటకు దుఃఖమును మాతృదేశమును జేరుటకు సంతోషమును మనముల బాధించుచుండ, సుఖప్రయాణమునకై రేవుదరినున్న భారతీయుల మనఃపూర్వక దీవనలనంది కరతాళధ్వనుల మధ్య స్టీమరెక్కి స్వగృహమునకు పయనమైరి.



# పండ్రెండవ అధ్యాయము

తండ్రిగారికిసహాయ్యులై
ఇంగ్లాండునందుండుట.

యువరాజుయువరాణిగార్లు రినౌన్ అను పొగ యోడలో కరాచీపట్టణమునువదలి మేనెల 8 - వ తేదిన పోర్టుమత్ రేవువద్దదిగిరి. దోవలో కార్ఫ్యు, ఆథెన్సు, మాల్టాజి బ్రాల్టరు దేశములం జూచిరి. కార్ఫ్యుపట్టణమువద్ద ఎడ్వర్డుచక్రవర్తి అలెగ్జాండ్రా మహారాణిగార్ల దర్శనార్థమైవేచియున్న గ్రీసురాజు గారు యువరాజు యువరాణిగార్ల నాహ్వానము జేసెను. యువరాజుగారి జననీ జనకులు తర్వాత కొంతకాలమునకచ్చట జేరిరి. వారుచేరగనే యువ రాజు యువరాణిగార్లును గ్రీసురాజుగారును వారి పడవలోపలికివెళ్ళి తోడ్కొనివచ్చిరి. కార్ఫ్యుపట్ట ణమునుండి యువరాజు యువరాణిగార్లును ఎడ్వర్డు అలెగ్జాండ్రా గార్లును ఆథెన్సుకు వెళ్లిరి. అక్కడ కొన్ని వేడుకలంజూచి ఎడ్వర్డు అలెగ్జాండ్రాగార్లు కుమారునికంటె నొకరోజుముందే ఆథెన్సు వదలి

నేపిల్సుకు వెళ్లిరి. యువరాజు యువరాణిగార్లు ఆధె న్సువదలి 8 - వ తేదిన పోర్ట్సుమత్ చేరి అక్కడ నుండి పురజనుల సంతోషనాదములమధ్య లండను పురవరమునకు పయనమైరి. విక్టోరియాస్టేషన్ వద్ద వారు చేరునప్పటికి తమకంటెముందుగానే లండను చేరిన జననీజనకులును ప్రధానమంత్రులును పార్లమెంటుసభ్యులు కొందరును వేనవేలు ప్రజలును యువరాజు యువరాణిగార్లకు స్వాగతమిచ్చుటకై యచ్చట గుమికూడి యుండిరి. సైనికపరివారము వీధులవెంబడివరుసతీరి శ్రీవార్లకుమర్యాదజూపెను. జయజయధ్వనులమధ్య శ్రీవార్లు కైలుదిగి ఉత్సవముతో రాజభవనమునకరిగిరి. నాటిసాయంత్రము ఎడ్వర్డురాజుగారు గొప్ప విందుజేసి కుమారరత్నమును కోడలును హిందూదేశయాత్ర జయప్రదముగసలిపి సుఖముగ స్వగృహముచేరినందుకై సంతసించుచు భగవంతునికి వందనము లాచరించిరి. ఆనెల 13-వ తేదిన వెస్టుమినిస్టరు దేవాలయమున శ్రీవార్లసుఖాగమనమునకై మతగురువులు ప్రజలు దేవునికి నతులొనర్చిరి. భరతఖండమునుండి శ్రీవారు

తెచ్చిన వివిధమృగములను రాయల్ జూలాజికల్ సొసైటీ భవనమునందు భద్రముగ కాపాడునట్లు యేర్పాట్లు చేసిరి. మేనెల -వ తేదిన లండనుపుర పాలనసంఘము వారు గిల్డుహాల్ అను సుందరభవనమునందు మహాజనసభగావించి యువరాజు యువరాణిగార్ల గౌరవించిరి. అపుడు యువరాజుగారు హిందూదేశమునందుచూచిన ముఖ్యాంశములను హిందూదేశమునుగూర్చి తమ అభిప్రాయములను జెప్పుచు ఇట్లు ప్రసంగించిరి "మనము హిందూదేశమునకు పోయి చ్చెదముఅని సులభముగాఅందుము గాని ఒకరష్యాదేశమునుమినహా తక్కినయూరోపు ఖండమంతయు నెంత గొప్పదో హిందూ దేశము అంత గొప్పఖండమనియు, అందు వివిధజాతులవారగు మూడుకోట్లజనులు నివసించుచున్నారనియు, అందు వివిధజాతులు వివిధభాషలు, వివిధమతములు వివిధతరగతుల నాగరికములు నిబిడీకృతమైయున్నవనియు మనలో ననేకులు గమనించుటలేదు. ఆ దేశముయొక్క విశేషవిస్తీర్ణమును వైభవములును పలుతెగలును వివిధ శీతోష్ణస్థితులును, మంచు శిఖ

రాగ్రములుగల పర్వతములును హద్దులేని కానన ములును, మహానదులును, శిల్పకళాకుశలత్వమును తెలియజేయు శాశ్వతపు కట్టడములును వెండియు ప్రాచీనాచారములును వీక్షించి నేనెంతయు అచ్చెరువందితిని. భారతీయుల ఓర్పును, డాంబికములేని జీవనమును, రాజభక్తితత్పరతయు, దైవభక్తియు, నేనెంతయు గమనించితిని. మరియు మనప్రభుత్వము యొక్క న్యాయ పరిపాలనయందు వారికి నమ్మకము కలదని నాకు తెలియును. నేనువినినదానిని బట్టియు, చూచినదానినిబట్టియు, మనపరిపాలనలో నింకకొంచెము విశేషముగా కనికరమును గనబరచినయెడల హిందూదేశపరిపాలన మనకుసులభతరముగ జేయబడునని నాయభిప్రాయము. ఆవిధముగా మనము చేసిన దానికి ప్రతిఫలము మిక్కిలి విశేషముగను నిర్వ్యాజముగనుండునని నేనుముందుగ నేచెప్పుటకు సాహసించుచున్నాను.'' ఇట్టిమహద్వాక్యములతో గూడిన శ్రీ జార్జి యువరాజుగారి ఉపన్యాసమును హిందూదేశ మందలిపత్రికలును, ప్రజలును మిక్కిలి మెచ్చుకొనిరి. యువరాజుగారు తానుహిందూదేశ

మున మొత్తముమీద సుమారు తొమ్మిదివేలమైళ్లు రైలులో ప్రయాణముజేసితినని చెప్పిరి. ఈప్రయాణమున హిందూదేశమందలి ముఖ్యభాగములన్ని యుదర్శించి హిందూ దేశీయ ప్రాముఖ్యతనుగురించి మంచి యభిప్రాయముగలవారైరని పైనపేర్కొనబడిన వాక్యములవలన స్పష్టమగుచున్నది. శ్రీవార్లకు మే నెల 23 తేదిన మాన్షన్ హౌసులో లార్డు మేయరుగారు గొప్పవిందుచేసి గౌరవించిరి. ఇంకను అనేకవిందులు ఏర్పాట్లు సేయబడెను. ఈవిందులన్నియు శ్రీవార్లు సుఖముగా మాతృభూమికివిచ్చేసినందుకు వారి వారి సంతోషమును తెలుపుటకై యేర్పాటుచేయబడినవిగాన యువరాజు యువరాణిగార్లు వానివి నిరాకరించక తమ అంగీకారముచే వానిం గౌరవించిరి ఈవిందులు ముగిసిన పిమ్మట రాజదంపతులు 26-వ తేది బయలుదేరి అల్ఫాన్సో రాజుగారికిని బెటన్ బర్గు రాచకుమారికయగు ఈనా గారికిని జరుగు వివాహమహోత్సవమునుదర్శింప మాడ్రిడ్డునకుపోయిరి. ఆ కార్యము జరిగినతర్వాత క్షేమముగాస్వగృహముచేరిరి. ఆవల కొంత కాలము

స్వగృహమునుండి నార్వేరాజుగారి పట్టాభిషేకమును వీక్షించుటకు వెళ్లిరి. నార్వే రాజుగారు యువరాజుగారి తల్లికి మేనల్లుడు. నార్వేరాణిగారు యువరాజుగారి సోదరి. కావున నిరుపార్శ్వముల సమీపబంధువులగుటచే వారి పట్టాభిషేకమహోత్సవమునుజూడ సంతోషించివెళ్లిరి. ఆమహోత్సవము ట్రాన్స్హీంపట్టణముయొక్క పాతకెటీడ్రల్ భవనమున జరిగెను. దానింజూచి యువరాజుయువరాణిగార్లు స్వగృహమునకు జేరిరి. నాటినుండి తండ్రిగారివద్దనేయుండి రాచకార్యమును చక్కబెట్టుకొనుచు వారికి సహాయులై యువరాజుగారు రాజ్యవ్యవహారముల నేర్చుకొనుచుండిరి. ఆంగ్లేయరాజుగారికి వివిధదేశములనుండి అనేక ప్రదర్శనములకు ఉత్సవములకు మున్నగువానికి ఆహ్వానములువచ్చుచుండును. వాటికన్నిటికి రాజుగారే స్వయముగా పోవలెనన్న రాజ్యవ్యవహారతొందరలవలన తీరికయుండదు. మరియు పోక నిరాకరించుటకు మర్యాదగానుండదు. గావున ముఖ్యముగా రాజుగారు వెళ్లవలసిన కార్యములకు యువరాజుగారే రాజ

ప్రతినిధిగా వెళ్లి కార్యముల జరుపుచు నెల్లవారికి సంతోషమును కలుగజేయుచుండిరి. రాచకార్యములయందును తండ్రిగారును యువ రాజుగారును ఒకరికొకరు సలహానందుచు లోపములేక నిర్వర్తించుచుండిరి.



# పదమూడవ అధ్యాయము

తండ్రిగారి మరణము

ఇట్లుండ, సప్తమ ఎడ్వర్డు చక్రవర్తిగారు ఫ్రాన్సు దేశమునకు వెళ్లి దోవలో వారికి జబ్బుచేసెను. కాని వారు దానిని లక్ష్యముచేయక యథావిధిగ సంచారముచేసి లండను నగరముచేరిరి వ్యాధి నానాటికి బలమగుచుండెను ఎడ్వర్డు రాజుగారు రాచకార్యములను, స్వకార్యములను లోపములేకుండ విచారించుచుండుటచే ప్రజలు వారిజాడ్యము నివారించెనని తలచిరేగాని యది అబద్ధము. రాజుగారికి రాజ్యప్రజలయందును తన విధాయక ధర్మములయందును గల యదార్థమైన అభిమానముచే నట్లొనర్చుచుండిరేగాని, జాడ్యము నివారించుటవలన గాదు. 1910 సంవత్సరం మెవెల 5 తేదిన రాజుగారికి విశేషజబ్బుగానున్నదని రాచనగరున వాడుక పుట్టెను; మరియు వార్తాపత్రికలలో ప్రచురమయ్యెను. అపుడు అలెగ్జాండ్రామహారాణిగారు విదేశములకేగియుండిరి ఆమెగారికి కెలే

పట్టణమువద్ద భర్తగారికి దేహస్థితి జబ్బుగానున్న దని సూచనగా తెలిసెను. అప్పుడు సముద్రమున గొప్ప తుపానుకొట్టుచు ఓడలుపోవుట కష్టముగా నుండెను. అలెగ్జాండ్రా మహారాణిగారు తక్షణమే భర్తగారివద్దకు వెళ్ళవలెనని తొందరపడుచుండిరి ; కాని ఓడ అధికారులు ఈసమయమున ప్రయాణముచేయుట యపాయకరమని నొక్కిచెప్పిరి. ఎవరెన్ని చెప్పినను ఆసాధ్వీ లలామము వినక, మోటు ధైర్యముతో పొగయోడ నెక్కి ప్రయాణము సాగింపుమని నావాధికార్లకు ఆజ్ఞనొసంగెను. వారట్లు చేయగా, దైవకృపవలన నిరపాయముగా నావ గారు 5 తేదిన భర్తగారి వద్దకుజేరెను. రాణిగారి కుమార్తెలు కొందరు ఆవరకే తండ్రిగారినిచూచుటకై వచ్చియుండిరి. వారి కనిష్ట కుమార్తెయగు నార్వేరాణిగారు మాత్రము సకాలములో చేరక పోయిరి. రాజవైద్యులు ప్రథమమున ప్రకటించిన సర్కారు హుకుంవలన "రాజుగారు బ్రాంకైటిస్ (Bronchitis) అను వ్యాధివల్ల రెండురోజులనుండి జబ్బుగానున్నారు. శ్రీవారి దేహస్థితి ఆయాసమును

కలిగించుచున్నది". అని తెలియవచ్చెను. అనేక ఘనవైద్యులు దివ్యౌషధములతో వచ్చి రాచనగరు నందు జేరిరి. ప్రజలు గుంపులుగుంపులుగా శ్రీవారి క్షేమమారయుటకై రాచనగరున కరుగుచుండిరి. కాని వైద్యులు ప్రజలకు ధైర్యము చెప్పజాలక పోయిరి. శ్రీవారి వ్యాధి మరింత వృద్ధియయ్యెను. 6 తేది వుదయము 7 గంటలకు ప్రకటింపబడిన సర్కారుహుకుం " ఈరోజు రాజుగారి దేహస్థితి మిక్కిలి జబ్బుగానున్నది శ్రీవారు బ్రతుకుట దుర్లభము " అని తెలియజేసెను. ప్రజల యొక్కయు, అలెగ్జాండ్రా మహారాణి, జార్జి యువరాజు మున్నగు రాచకుటుంబమువారి యొక్కయు దుఃఖము విశేషమయ్యెను. ఆరోజు మధ్యాహ్నము వరకు సప్తమ ఎడ్వర్డు చక్రవర్తి తన బంధువుల నందరిని గుర్తించుచు, తనకనిష్టకుమార్తెం దలచుకొంటినని యామెగారికి తెలుపుమని చెప్పిరి. తర్వాత శ్రీవారికి స్మారకము తప్పెను. అలెగ్జాండ్రా మహారాణిగారు మిక్కిలి ఘోరముగా భర్తపైబడి యేడ్చుచుండెను. నాటిరాత్రి, అనగా మేనెల 6 తేది

శుక్రవారము రాత్రి, నడిజాముకు శ్రీసప్తమ ఎడ్వర్డు చక్రవర్తి 68 సంవత్సరముల ప్రాయమున దివంబున కరిగె. తక్షణమే మహాగురువులు శ్రీవారి సామీప్యము జేరి శ్రీవారి కళేబరమునకు ఉత్తమ ప్రాప్తి గలుగ ఏసునాధుని స్తోత్రము జేసిరి. తక్షణమే వెస్టుమిన్స్టరుకోవెలయొక్క గంట రాజుగారి మరణమును సాటించుచు ఖంగుమని మ్రోగుచుండెను. దేశదేశములకు రాజుగారు పరమపదించిరని తంతి వార్తాలు రవాణా జేయబడెను లండను పౌరులందరు రాచనగరులవద్ద గుంపులుగుంపులుగా చేరిరి. రాచకుటుంబమువారి రోదనధ్వనులు హాహాకారంబులు వృద్ధియయ్యెను. శ్రీవారి దేవేరియగు అలెగ్జాండ్రా మహారాణిగారు ఆర్తరవంబులుచేయుచు భర్తవెంబడిచేరి విలపించుచుండె. "నారీణాంభూషణం పతిః" అను న్యాయప్రకారము అలెగ్జాండ్రా మహారాణిగారి నలంకరించుచుండిన అమూల్యంబగు మహాభూషణ మెడబాయుటవలన, ఆమెగారు, నిరంతరము కళాహీనముగా జేయబడిన క్లైరింగి, మిక్కిలి దుఃఖించుచుండె. జార్జి యువరాజుగారుతండ్రిగారి

మరణమువలన తన కంతరంగమిత్రుడును తండ్రియు నగు వారింక లేరుగదా యని శోకించిరి. రాజ్య సింహాసనా రూఢులైనది మొదలు సుమారు 10 సంవత్సరములు అవిచ్ఛిన్నముగ మహారాజ్యాధిపత్యమును నిర్వహించి "పరోపకారార్థ మిదం శరీరం" అను న్యాయమును చక్కగ పాలించి, ప్రజలసౌఖ్యమే తన సౌఖ్యమనియెంచి నిరంతరము ప్రజల అభ్యుదయమునకై కృషిచేయుటయందు స్వకీయ దేహారోగ్యమును గమనింపకుండిన యానృపశిఖామణికి హిందూదేశీయులు మున్నుగాగల ప్రజలెల్లరు మిక్కిలి దుఃఖించిరి. శ్రీసప్తమ ఎడ్వర్డు చక్రవర్తి వివిధదేశరాజులతో సఖ్యములు కుదిర్చి, అన్యోన్యమైత్రిని పెంపొందజేసి, శాంతికరుడని జగత్ప్రఖ్యాతిగాంచిన ఆంగ్లేయ రాజశిఖామణిగావున వారి యాకస్మిక మరణమునకు అన్యదేశాధిపతులును దుఃఖించిరి. గడచినదానికి వగచి ప్రయోజనములేదుకావున కాలక్రమమున అందరిశోకములు చల్లారెను. శ్రీవారి కళేబరమున కుత్తరక్రియలు జరుగుటకు తగుయేర్పాట్లు సలుపబడెను. శ్రీవారు

మృతినొందిన తర్వాత పదునాలుగు రోజులవరకు రాజభవనమునందే రాచకళేబరములకు జరుగు యుత్తరక్రియలు జరుపబడెను. రాజుగారు శుక్రవారమునాడు రాత్రి గతించిరి. శుక్రవారము మొదలు బుధవారమువరకు శ్రీవారికళేబరము వారు మృతినొందిన శయ్యాగృహముననే యుంచబడెను. బుధవారము సాయంత్రము అక్కడినుండి ఉచిత వైభవముతో రాజసింహాసనముండు భవనమునకు తీసికొనివెళ్లి మరుసటి మంగళవారమువరకు ఆకళేబరము నచ్చట నుంచిరి; మంగళవారము నాడక్కడి నుండి రాజసన్మానములతో వెస్టుమిన్స్టరు హాలునకు తీసికొనివెళ్లిరి. అక్కడ బేస్తవారమువరకు నుంచబడెను. మంగళవారమునుండి బేస్తవారము వరకు వెస్టుమిన్స్టరు హాలులో 500000 మంది ప్రజలు శ్రీవారికళేబరమువద్దకు వెళ్లి దర్శించిరి. ఆవల శుక్రవారము నాడుదయము గొప్ప ఊరేగింపుతో రాజకుటుంబమువారు, విదేశరాజులు, ప్రజానాయకులు, మంత్రులు, విదేశరాయభారులు మున్నగు మహాజనులందరును గుంపులుగుంపులుగా రాజకళేబరము

వెంట విన్జరుపురమునకు జని, అచ్చటి నాటిరోజు రెండుగంటలకు శెంట్ జార్జికోవెలలో శ్రీ సప్తమ ఎడ్వర్డు చక్రవర్తిగారి కళేబరమును పాతిపెట్టిరి.



# పదునాల్గవ అధ్యాయము



## ఇంగ్లాండులో పట్టాభిషేకము

సప్తమ ఎడ్వర్డు చక్రవర్తిగారి తదనంతరము వారి జ్యేష్ఠతనయుడును యువరాజునునగు జార్జి రాజు సింహాసనాసీనులగుట కర్తవ్యము. తండ్రిగారి మరణముచే శోకసాగరమున తేలుచున్నను, ఆంగ్లేయ రాజ్యనీతిప్రకారము ఒకక్షణమేనియు రాజు లేక ఆంగ్లేయరాజ్యము అరాచకముగ నుండ నేరదు కావున యువరాజుగారు తక్షణమే రాజైనటుల మతగురువులచేతను మంత్రిసత్తములచేతను ప్రకటింపబడెను. మంత్రులు సర్కారు మొహరులను రాజుగారికప్పగించి మరల వారివద్దనుండి గైకొనిరి. మరుసటిరోజు ప్రివీకౌన్సిలువారు సమావేశమైరి. శ్రీజార్జిరాజు సింహాసనము నధిష్ఠించి రాజుగా ప్రథమోపన్యాసమునిచ్చెను. దుఃఖపూరితమైన హృదయముకావున విశేషముమాటలాడలేక తమతండ్రిగారి చావువలన తమకుకలిగిన కొరతను దుఃఖమును

తెలుపుచు, తండ్రిగారి పద్ధతినే యవలంబించి తామును లోపములేక పరిపాలనచేయుదుమని చెప్పి చాలించిరి. సభవారును తగినమాటల ప్రత్యుత్తర మిచ్చి శ్రీవారినూరార్చిరి. పార్లమెంటు సభవారును నాటిరాత్రి మూడుగంటలకు సమావేశమై నూతన రాజుగారికి తమవిధేయతను రాజభక్తిని విన్నవించుకొనిరి. 9 వ తేదిన వివిధదేశములకు పంచమజార్జి రాజ్యాధిపత్యము వహించినట్లు ప్రకటనలు పంపబడెను. నాటిదినమె నార్వేదేశమునుండి జార్జిరాజు వారి కనిష్ఠసోదరియు నాయమభర్తయు లండను నగరమునకు చేరిరి. ఆనెల 11 తేది పార్లమెంటు వారి తర్ఫున ప్రతినిధులు రాజుగారిని అలెగ్జాండ్రా మహారాణిగారిని దర్శించి ఎడ్వర్డు చక్రవర్తిగారి మరణమునకు తమ దుఃఖమును జార్జిరాజుగారు సింహాసనారూఢులైనందులకు సంతోషమును తెలుపుకొనిరి. మరునటిరోజు హిందూదేశములో సింలా నగరమున మింటో ప్రభువుగారు పంచమజార్జిరాజు హిందూదేశ చక్రవర్తియైనట్లు ప్రకటించిరి పంచమ జార్జిరాజుగారు తమ తండ్రిగారి ఉత్తరక్రియల దర్శిం

పవచ్చిన వివిధరాజ్యాధినాథుల నుచితసత్కారంబు
లచే గౌరవించుచు మేనెల 20 తేదివరకు కాలము
గడపిరి. ఆవల రాజ్యవ్యవహారముల ముఖ్యముగా
విచారించుకొన ప్రారంభించిరి. జూన్ నెల 2 తేదిన
రాజుగారు మార్‌ల్‌బరో భవనమునందు యునైటెడ్
స్టేట్సు, ఇటలీ, నార్వే దేశములనుండి వచ్చిన ప్రతి
నిధులకు స్వాగతమిచ్చి వారిని గౌరవించిరి. 6 తేదిన
అమెరికాలోని యునైటెడ్ స్టేట్సునకు ప్రెసిడెం
టుగానుండిన రూస్‌వెల్టుదొరవారును ఆయన ధర్మ
పత్నియు లండనుపురికిరాగా రాజదంపతులు వారల
నాహ్వానముచేసి గౌరవించిరి. 9 తేదిన జార్జిరాజు
గారు లండనునగరపాలక సంఘమువారియొక్కయు,
లండను కౌంటికాన్సిలువారియొక్కయు, రాయల్
సొసైటీవారియొక్కయు విన్నపపత్రికలం గైకొనిరి.

ఈకాలముననే హిందూదేశ రాజప్రతినిధియగు
మింటో ప్రభువుగారి పరిపాలనా నియమితకాలము
ముగియగా వారిస్థానమున [ప్రస్తుతము రాజప్రతి
నిధిగానుండు] శ్రీ హార్డింజిగారిని శ్రీవారు జూన్
10 తేదిన నియమించిరి. తర్వాత జూన్ నెల 22 తేదిన

రాజుగారు తమ ప్రథమపుత్రుని వేల్సుప్రభువుగా నియమించినట్లు రాజప్రకటనచేసిరి. జూన్ నెల 28 తేదిన సర్ రిచ్చర్డుసాలోమన్ దొరవారు, మూరల్ బరోభవనమునందు రాజదంపతుల దర్శించి ఇదివరలో వీరు దక్షిణ ఆఫ్రికానూతన పార్లమెంటును ప్రారంభించవచ్చినపుడు శ్రీరాణిగారికి బహుమతిగానియ్యదలచుకొనిన రత్నాలసరమును నాడాదేవేరిగారి కొసంగి, వందనములనంది దక్షిణాఫ్రికాకు వెళ్లిరి. ఆసంవత్సరమే జూలై నెల 19 తేదిన జార్జిరాజుగారు ఇంగ్లాండులో తమ పట్టాభిషేకము జరుగుటకు 1911 సంవత్సరం జూన్ నెల 21 తేదిని నిర్ణయించుచు రాజప్రకటనను సాదరుచేసిరి. ఆగస్టు నెల 2 తేదిన ఇండియాగవర్నరుజనరలుగా నియమింపబడిన సర్. సి. హార్డింజిగారికి బేరన్ హార్డింజి ఆఫ్ పెన్‌హర్ట్సు అను గౌరవబిరుదమునిచ్చి వారిని లార్డుగా జేసిరి; అంతేగాక అక్టోబరు నెల 12 తేదిన మూరల్ భరోభవనమున జార్జిరాజుగారు హార్డింజి ప్రభువుగారికి జి. సి. ఐ. ఇ; జి. సి. యస్. ఐ., అను అపూర్వ గౌరవబిరుదముల నొసంగి వారి

నెంతయు సన్మానించిరి. తర్వాత ఇంగ్లాండులో నప్పుడు జరుగుచుండిన రాచకీయ కలవరములలో లిబరల్సుకును కాన్సర్వేటివ్ సకును గల వివాద విషయములనుగురించి రాజమంత్రులు పలుమారు శ్రీరాజుగారినిదర్శించి వారి యభిప్రాయములనందు చుండిరి. 1911 సంవత్సరం ఫిబ్రవరినెల 21 తేదిన శ్రీజార్జిరాజుగారు ప్రథమలెవీ (అనగా ఘనముఖు లకు దర్శనమిచ్చి వారిరాజభక్తిని యంగీకరించుట) యను సభను జరపిరి. ఆవల మేనెల 16 తేదిన శ్రీ జార్జిరాజుగారు బకింగ్‌హాముభవనమువద్ద నూతన ముగా నిర్మించబడిన విక్టోరియా మహారాణిగారి ప్రతిమను బహిరంగపరచు ప్రథమ మహోత్సవ మును ఘనముగా జరపి, ఆప్రతిమను నిర్మించిన బ్రాక్‌దొరవారికి బిరుదులిచ్చి గౌరవించిరి.

జార్జిరాజుగారి పట్టాభిషేక మహోత్సవమునకై జూన్ నెల 22 తేదిన నిర్ణయించుచు ప్రకటనలదివరకే ప్రకటింపబడినట్లు పైన పేర్కొనబడినది. పట్టాభిషేక యత్నములన్నియు విరివిగా జేయుటకై ప్రజానాయ కులు తగుయేర్పాట్లు చేయుచుండిరి 1911సం౹ జూన్

నెల 22 తేది ఆంగ్లేయసామ్రాజ్యచరిత్రలో నెంత యు ప్రఖ్యాతిగాంచిన సుదినము. నాటిదినము శ్రీపంచమజార్జి రాజుగారును శ్రీమేరీ మహారాణిగారును అత్యంత వైభవముతో వెస్టుమినిస్టరు భవనమున పట్టాభిషిక్తులైరి. నాటిదినమున లండనునగరవైభవము జూచి తీరవలసినదే కాని వర్ణింప నశక్యము. వివిధదేశాధిపతులు సేనాధిపతులు, రాయభారులు, రాజప్రతినిధులు, మంత్రివరులు, శ్రీమంతులు, ప్రజాప్రముఖులు, పట్టాభిషేకమంటపము నలంకరించిరి. మతగురువులు ఉచితాసనములనాక్రమించిరి. ప్రధానమత గురువుగారు ఆంగ్లేయాచారములప్రకారము జరుగవలసిన పట్టాభిషేకప్రక్రియలన్నియు యథావిధిగజరపిరి. రాజదంపతుల నుత్సవముతో రాచనగరున జేర్చిరి అనంతరము పురవరులు రాజదంపతుల ననేకవినోదములచే సంతోషపరచి గౌరవించిరి ఆనెల 27-వ తేదిన రాజుగారు బకింగ్‌హాము నగరమున గొప్పవిందుచేసి ఆరువేలమంది ఘనముకులకు ఆహ్వానములబంపి వారలగౌరవించిరి. జూలై 6-వ తేదిన సెంట్ జేమ్సుభవనమున తమ పట్టాభి

షేకసమయమున నొసంగబడిన బిరుదుల నాయూ ప్రముఖులకున్వాయముగా శ్రీజార్జిరాజుగారేయొసంగి తమయభిమానమును తెలియపరచిరి. తర్వాత మరు సటిదినము రాజదంపతులు తమ జ్యేష్ఠకుమారుని మేరీరాకుమారికను వెంట బెట్టుకొని ఐర్లండుకు వెళ్లిరి. అచ్చట ప్రజల సంతోషనాదములమధ్య డబ్లినుపట్టణమును 8 తేదిన జేరిరి. శ్రీవారు ప్రజల చిన్నపమునంది కొన్ని ముఖ్యస్థలములం దర్శించి విందులగావించి డబ్లినునగరదర్శనమును జయప్రద ముగా గావించి వేల్సుదేశమునకు వెళ్లిరి. అక్కడ జులై 13 తేదిన జార్జిరాజుగారు మహాసభ గావించి జ్యేష్ఠకుమారునికి వేల్సురాజైనందుకు జరుగవలసిన ప్రాచీనాచార సంస్కారములను మిక్కిలి వైభవ. ముతోజరపిరి. తర్వాత రాజదంపతులు బెంగరు పట్టణమునకువెళ్లి అక్కడ నార్తువేల్సు యూనివర్సి టీ కాలేజియొక్క నూతన కట్టడములలో ప్రథమ ప్రవేశమహోత్సవమును జరపిరి. అక్కడనుండి శ్రీవారు జూలై 17 తేదిన ఎడింబరో పట్టణము నకువెళ్లి ప్రజలయాతిథ్యముంగైకొని 21-వ తేదిన

లండనునగరము జేరిరి. ఆనెల 26 తేదినే గ్వాలియరు మహారాజుగారు జార్జిమహారాజుగారి పట్టాభిషేక జ్ఞాపకార్థమై ధర్మకార్యములకువినియోగింప జార్జి రాజుగారికి తొమ్మిదివేల నవరలను పంపిరి శ్రీవారతి సంతోషముతో నా ద్రవ్యముం గైకొని ధర్మకార్యములకై వినియోగపరచిరి. తర్వాత శ్రీజార్జి రాజుగారు పత్నీ సమేతముగ కాలీపట్టణమునకుపోయి ఆగస్టునెల 7 తేదిన లండనునగరముచేరిరి. శ్రీవారు ఇంగ్లాండులో రాజైనందుకు పట్టాభిషేకమహోత్సవమును జరిపిరి. అటులనే హిందూదేశమునకు చక్రవర్తిత్వ బిరుదమును వహించిన పట్టాభిషేక మహోత్సవమును తాముస్వయముగానే హిందూదేశమందు జరుపనిశ్చయించుకొనిరి. సాధారణముగ ఇదివరలో రాజులందరు వారితర్పున రాజప్రతినిధిగారిచే హిందూదేశములో నీ మహోత్సవమును జరుపుచుండిరేగాని ఆంగ్లేయరాజులెవ్వరును స్వయముగా హిందూదేశమును దర్శించినదిగాని హిందూదేశమున పట్టాభిషిక్తులైనదిగాని లేదు. కావున భారతీయుల నాదరించదలచి జార్జిరాజుగారును

వారిధర్మపత్నియు స్వయముగా హిందూదేశ ప్రజలను దర్శించి ఢిల్లీపట్టణమున పట్టాభిషిక్తులగుట కంగీకరించిరి. నవంబరు 10 తేదిన శ్రీవారుఇంగ్లాండులో లేని సమయమున రాచకార్యముల నిర్వర్తించుచుండుటకై తమతర్ఫున ప్రిన్సుఆర్థరుగారిని కాంటర్బరీ ఆర్చిబిషప్‌గారిని లార్డుఛాన్సెలరుగారిని లార్డుమార్లేగారిని సభికులగా నేర్పరచి జార్జి రాజుగారు కమీషన్ సాదరుచేసిరి. అంతట మరునటిరోజుననే అనగా 1911-వ సం॥ నవంబరు నెల 11-వ తేదిన శ్రీ పంచమజార్జి రాజుగారును శ్రీమేరీ మహారాణిగారును పట్టాభిషేకమహోత్సవమునకు తగిన పరివారముతో లండనునగరమునుండి పోర్ట్సుమత్ రేవువద్ద మెడీనా అను పొగయోడనెక్కి భరతఖండమునకు బయలుదేరిరి.



# పదునైదవ అధ్యాయము



## హిందూదేశమున పట్టాభిషేకము

రాజదంపతులు జిబ్రాల్టరుమీదుగా నవంబరు 20-వ తేదిన పోర్టుశేౕవద్దజేరిరి. అక్కడ ఈజిప్టు రాజుగారును కిచనరు ప్రభువుగారును శ్రీవార్లం దర్శించి స్వాగతమిచ్చిరి. మెడీనా నావ 2.-వ తేదిన ఏడనురేవుచేరెను. మరుసటిదినము ప్రజలు సభజేసి శ్రీరాజదంపతులకు విన్నపపత్రికనుచదివిరి. అందుకు ప్రత్యుత్తరమిచ్చి రాజదంపతు లచ్చటినుండిబయలు దేరి బొంబాయి నగరమున కరిగిరి. బొంబాయి పౌరులు పట్టాభిషిక్తులగుటకై కళత్ర సహితముగ వేంచేయుచున్న శ్రీ పంచమజార్జి నృపచంద్రునకు అనురూపమైన స్వాగత మొసంగుటకై యొకసిధి యేర్పాటుచేసి తగినసన్నాహములతో సిద్ధముగ నుండి శ్రీవార్లరాకకై నిరీక్షించుచుండిరి బొంబాయి గవర్నమెంటువారును ప్రజలకుతోడ్పడి అనువగు యేర్పాటులనుచేసిరి. డిసంబరు 2-వ తేది శని

వారము ఉదయమున పదిగంటలకు శ్రీరాజదంపతులు మేడీనా పొగయోడలో బొంబాయిరేవుజేరి అపోలో బందరురేవునకు కొంచెము దూరములో నించిరి. శ్రీరాజదంపతులకు స్వాగతమొసంగుటకై అపోలో బందరురేవువద్ద సురుచిరమంటపమొకటి సుమారు మూడువేలమంది సభ్యులు ఆసీనులగుటకు తగినట్టుగా నిర్మింపబడెను. ఇండియాగవర్నరు జనరలుగారగు హార్డింజిప్రభువును బొంబాయి గవర్నరుగారును నాటిసాయంకాలము సుమారు 3-30 గంటలలోన సపరివారముగా సభామంటపమున జేరిరి. ఆహ్వానముచేయబడిన బొంబాయి పౌరులు మున్నగువారు వారివారిస్థానముల నాక్రమించి సభాభవనము నలంకరించిరి. శ్రీమన్మహారాజాధిరాజ శ్రీపంచమజార్జి సార్వభౌములును శ్రీమత్ రాజరాజేశ్వరి మేరీమహారాణియు సాయంత్రము 4 గంటలకు మెడీనా పొగయోడలో అపోలో బందరురేవునదిగి, రాజసన్మానములతో సభాభవనమునకు విచ్చేసి ఉన్నత సింహాసనముల నలంకరించిరి. సభ్యులందరు శ్రీవార్లకు జయజయ

ధ్వనులచే స్వాగతమిచ్చిరి. అంతట బొంబాయి నగరపాలక సంఘాధ్యక్షులైన సర్ ఫిరోజిషామెహతాగారు ఉచితవాక్యముల విన్నపపత్రికం జదివిరి. శ్రీపంచమజార్జి చక్రవర్తిగారు పౌరులస్వాగతములకు తమవాదనములర్పించుచు ప్రత్యుత్తరమిచ్చిరి. శ్రీమేరీమహారాణిగారికి లేడీమెహతాగారు సుందరతరమైన పూబంతియొసగి బొంబాయి స్త్రీజనసంతోషమును తెలియపరచిరి. అంతట శ్రీవారు ఊరేగింపుతో బయలుదేరి త్రోవనంతయు ప్రజలసంతోషనాదములను జయతోరణంబులను చిత్రవిచిత్రములగు జయస్తంభములనుగమనించుచు ముఖ్యవీధులగుండ తమయోడ జేరిరి. బొంబాయి నగరమాదివసమున దేదీప్యమానముగ పలురంగుల దీపకాంతులచే ప్రకాశించుచుండెను. మరునటి దినము ఆదివారమగుటవలన విశేష కార్యములులేక మధ్యాహ్నము శ్రీవారు ఓడనుండిదిగి మోటారుబండిలో బొంబాయి గవర్నరుగారిబంగళాకు వెళ్లిరి. అచ్చట గవర్నరుగారివిందారగించి మరల ఓడకుపోయి సాయంకాలము దైవప్రార్థనకై దేవాలయ

మునకు వెళ్లిరి. 4 తేది సోమవారము బొంబాయి నగరమందలి బాలురకందరకు విందుజరుగుచుండగా దానిందర్శించుటకై రాజదంపతులువెళ్లిరి. అచ్చట సుమారు ముప్పదివేలబాలబాలికలు సమావేశమై యుండిరి. వారిజండాలను సంతోష కల్లోలములను జూచి శ్రీవార్లుహర్షించి వారల నభినందించివెళ్లిరి. నాటిరాత్రి హార్డింజిప్రభువుగారు ఆగ్రా పట్టణము నకుపయనమైరి. మరునటిరోజు ఉదయము శ్రీరాజ దంపతులు బొంబాయి సామీప్యమున నున్న ఎలి ఫెంటు గుహలను దర్శించిరి. నాటిరాత్రి 10 - 45 గంటలకు దీపావళులచే నతిరమణీయముగ జేయ బడిన పురవీధులమధ్య నత్యంతవైభవముతో నూరే గుచు విక్టోరియాస్టేషనుచేరి సర్వవిధములైన సౌక ర్యములనిచ్చునట్లుగ నిర్మింపబడిన నూతనమైనరైలు బండిలోనెక్కి రాజదంపతులు పరివారసహితముగ ఢిల్లీనగరమునకు ప్రయాణమైరి. ధర్మరాజాది భారత మహారాజులకు రాజధానియై మొగలాయి చక్ర వర్తులకునివాసస్థానమై ప్రాచీనకాలమునుండి భరత ఖండమునందలి ముఖ్యనగరములలోనొక్కటిగ తేజ

ఢిల్లీచుండి 'ఇంద్రప్రస్థనగరము' 'హస్తినాపురము' అను నామాంతరములుగల ఢిల్లీపట్టణము రాజదంపతుల పట్టాభిషేక మహోత్సవమునకై వర్ణనాతీతముగ నలంకరింప బడియుండెను. శ్రీరాజదంపతులు ఢిల్లీపట్టణమున రైలులోదిగిన పిమ్మట స్టేషనువద్ద సమావేశమైయున్న గవర్నరుజనరల్ గారును స్వదేశ సంస్థానాధిపతులును, గవర్నర్లును మున్నగుప్రముఖులందరు కరతాళధ్వనులచే తమ సంతోషమును తెలిపిరి. అంతట ఇంపీరియల్ లెజిస్‌లేటివ్ కౌన్సిలు (సామ్రాజ్యశాసననిర్మాణసభ) వారువిన్నప పత్రికం జదివిరి. శ్రీమహారాజుగారు ఉచితవాక్యంబులజవాబిచ్చి ప్రజలస్వాగతముల సంతోషముగస్వీకరించితి నని చెప్పి తమబసకుచేరిరి.

డిసంబరు నెల 8 - వ తేది మధ్యాహ్నము ఢిల్లీపట్టణమున నొక సురుచిరారామ మధ్యమున ఎడ్వర్డు చక్రవర్తిగారి జ్ఞాపకార్థచిహ్నముగ భారతీయు లనేకులు చందాలువేసికొని నిర్మింపదలచిన సప్తమ ఎడ్వర్డు చక్రవర్తిగారి కంచుప్రతిమకు శ్రీ జార్జిమహారాజుగారు శంఖుస్థాపనజేసి ప్రజలరా

భక్తికిమెచ్చి సంతోషించిరి. మరుసటిరోజు శ్రీవారు కొన్ని ఆటలను పందెములనుజూచి సంతోషించిరి. 10 తేది ఆదివారముగాన దైవప్రార్థనతప్ప ఇతర కార్యములులేవు. 11 తేది నాడు శ్రీవారు సైనిక పటాలములకు బహుమతులిచ్చి వారలగౌరవించిరి. మరుసటిరోజు అనగా 1911 సం॥ డిసంబరు నెల 12 తేది మంగళవారము హిందూదేశ చరిత్రలో నెల్ల నత్యుత్తమస్థానము నాక్రమించిన సుదివసము. నాటి దినము భూలోక స్వర్గముగ దనరారుచుండిన ఢిల్లీ నగరమున శ్రీ శ్రీ శ్రీ పంచమజార్జి చక్రవర్తియు శ్రీ శ్రీ శ్రీ మేరీ చక్రవర్తినియు, నిరుపమానవైభవ ములమధ్య పట్టాభిషిక్తులైరి. దర్బారుమందిరమున సమావేశమైయున్న స్వదేశ సంస్థానాధి పతులును సైనిక ప్రతినిధులును ప్రజాప్రతి నిధులును గొప్ప ఉద్యోగియులును జనసామాన్యమును కరతాళధ్వ నులచే తమ సంతోషమును తెలిపిరి. శ్రీ పంచమజార్జి చక్రవర్తిగారు తమ ఉత్సాహమును ప్రజలయెడ వాత్సల్యమును తెలుపుచు హిందూదేశములోని ప్రజలక్షేమసౌఖ్యములకంటె తాముకోరునదెద్దియు

లేదని చెప్పిరి. మరియు "ఇదివరకు నాపూర్వులు మీ స్వత్వములవిషయమై చేసిన ప్రమాణములను వాగ్దానములను తిరిగి నేనును ఆమోదించుచున్నానని తెలుపుటకు సంతసించుచున్నాను. మీక్షేమము, తృప్తి సౌఖ్యములనే సదా కోరుచుండెదను. మీక్షేమాభివృద్ధులకై సదా భగవంతుని ప్రార్థించెదను" అని చెప్పి ఉపన్యాసమును ముగించిరి. తర్వాత గవర్నరు జనరలును మున్నగు గొప్ప ఉద్యోగీయులును, స్వదేశాధినాధులును శ్రీవార్ల సమీపమున కొక్కొకరు వచ్చి తమ విధేయతను రాజభక్తిని గనుపరచిరి. ఈ వ్యవహారమైన పిమ్మట శ్రీరాజదంపతులు దర్బారు మంటపమునుండి రాజమంటపమునకుజనిరి. అక్కడ శ్రీజార్జి చక్రవర్తిగారి రాజప్రకటనను ఇంగ్లీషు ఉర్దుభాషలలో చదివిరి. తర్వాత హార్డింజప్రభువుగారు శ్రీచక్రవర్తిగారు పట్టాభిషేక మహోత్సవ సమయమున ప్రసాదించిన వరములను ప్రకటించిరి. అందులో ముఖ్యమైనది హిందూ దేశమున విద్యాభివృద్ధికై 5౦ లక్షలరూపాయలను ప్రతిసంవత్సరము ప్రస్తుతముకంటె విశేషముగా వ్యయము చేయునట్లు

ఆజ్ఞయిచ్చుట. ఆసమయముననే నాటి సాయంకాలను శ్రీ జార్జి చక్రవర్తిగారు ఇకమీద కలకత్తాకు బదులు ఢిల్లీ నగరము హిందూ దేశమునకు రాజధానిగా చేయబడుననియు, బంగాళా రాజధానికి గవర్నరును, బీహారు, చోటానాగ్పూరు ఒరిస్సారాష్ట్రములకు లెఫ్టినెంట్ గవర్నరును, అస్సామునకు చీఫ్ కమీషనరును నియమింతుమనియు తెలియజేసిరి. శ్రీ జార్జి చక్రవర్తిగారి ఉపన్యాసములును, ప్రకటనలును భారతీయులెల్లరకు మిక్కిలి సంతోషమును కలుగజేసినవి. స్వదేశపత్రికలన్నియు శ్రీరాజదంపతులను హిందూ దేశమున స్వయముగా పట్టాభిషిక్తులగుటకు విచ్చేసినందున మిక్కిలి కొనియాడినవి. ఆంధ్రదేశజుల కృతజ్ఞతను సంతోషమును తెలుపుచు ఆంధ్రపత్రికలును దీర్ఘవ్యాసములు వ్రాసినవి. ఆ సందర్భముననొక ఆంధ్రవార్తాపత్రికయందు వ్రాయబడిన ఈక్రిందివాక్యము లెంతయు ఆంధ్రదేశజుల యభిప్రాయములబాగుగ వ్యక్తీకరించినవి "ఏస ప్రమాట్టు రవియ స్తమింపని సామ్రాజ్యమున కధిపతి యగుటచేకాక శ్రీరామ ధర్మరాజాదులేలి యమర

కీర్తిని సంపాదించిన పుణ్యభూమికి ఛత్రాధిపతియై నిరుపమానభాగ్యభోగ్యములయందోలలాడిన మొగలుల సింహపీఠికపైనధిష్ఠించి హిందువులు, క్రైస్తవులు, మసల్మానులు, పారశీలు, భారతీయులు, ఆంగ్లేయులు, మొదలగు వివిధజాతులవారిని ఒక్క పరిపాలనాశ్లేషమునందుజేరిచి, 'వారి యభివృద్ధి యందు నాసంతోషమును వారియైకమత్యమునందు నాబలమును వారి క్షేమమునందు నాశాంతియును కలవని' నుడువు సందేశమును ప్రకటింపగల జార్జి సార్వభౌముని వైభవము నిరుపమానము ఎక్కడనో ఎచ్చటనో ఎవరిచేతనో గాక తమ ఇంద్రప్రస్థనగరమున ఢిల్లీదర్బారున హిమవత్పర్వతసాక్షిగ గంగాసాక్షిగ భారతచక్రవర్తులసాక్షిగ తమంతటతామే తమ జార్జిసార్వభౌముని పట్టాభిషిక్తునిగ జేయుగలిగిన భారతీయుల యదృష్టము వర్ణనాతీతము." మరియొకచో నాపత్రికయేయిట్లువ్రాసెను. "ఆంగ్లేయరాజు ఐరోపాదేశమును విడచిపోవు నాచారము నేటివరకులేదు. ఈయాచారము శ్రీజార్జిమహాచక్రవర్తికాలమున నతిక్రమింపబడి ఈ యపూర్వగౌర

వము మన దేశమునకు లభించినందునకు దేశీయు లెల్లరు సంతోషస్వాంతు లగుచున్నారు. హిమాలయము మొదలు కన్యాకుమారికవరకును క్వెట్టా కొండలనుండి ఆస్సాము అరణ్యప్రాంతములవరకును హిందూరాజ్య రమామణి ప్రభుభక్తి తరంగముల యందు నూగులాడుచున్నది. ఆధునిక కాలమం దెన్నడు నిట్టిఅయత్నపూర్వకమైన భక్తియుద్రేకించి యుండలేదు. అంతేల? మనదేశపు వాతావరణ మంతయు ప్రభుభక్తిభరితమైయున్నది." ఈవాక్యములెంతయు నిక్కము సహజముగ రాజభక్తిగల భారతీయులకు శ్రీజార్జి చక్రవర్తిగారి నడవడికయు ఆదరవాక్యములును మిక్కిలి సంతోషావహముగ నుండెను. ఈపట్టాభిషేక మహోత్సవముజరిగిన రాత్రి శ్రీరాజదంపతులు గొప్పవిందుచేసి మహాజనులను గౌరవించిరి. మరసటిరోజు తోట విందులుసలిపి వేడుకలు పందెములు జూచుచు శ్రీవార్లు బహుసంతోషముగా గడపిరి. శ్రీమేరీమహారాణిగారు ఘోషాస్త్రీలను సమావేశమొనర్చి వారిం గౌరవించిరి. 14 తేది నాడు శ్రీవార్లు 40 వేల

సైన్యమును పరీక్షించిరి. 15-వ తేదిన గుఱ్ఱపుపందెములు మున్నగు వేడుకలంజూచిరి. శ్రీ రాజాగారు నాటిదినమే నూతన ఢిల్లీనగరమునకు శంఖుస్థాపన జేసిరి. మరునటిరోజు మధ్యాహ్నము ప్రథమమున పురప్రవేశమునందెట్లో అట్లే రాజసన్నాహముతో శ్రీ రాజదంపతులు ఢిల్లీనగరమున బయలుదేరి శ్రీజార్జి మహారాజుగారు నేపాలదేశమునకు వేటకై వెళ్లిరి. శ్రీమేరీమహా రాణిగారును తాజ్‌మహాలు చూచుటకు ఆగ్రాపట్టణమునకువెళ్లిరి. హార్డింజిప్రభువును ఇండియాసెక్రటరీ ఆఫ్‌స్టేట్‌గారగు క్రూప్రభువును కలకత్తాకు వెళ్లిరి.

నాటిదినమె నేపాళ దేశాధిపతియగు శ్రీ మహారాజాధిరాజ పృధ్వీవీరవిక్రమజంగ్‌బహదూర్ షా షర్‌జంగ్ పరలోక గతులైరి. ఆవార్తశ్రీజార్జి సార్వభౌమునికి తెలిసి తనప్రయాణము నాపుకొనదలంచిరి గాని శ్రీజార్జిరాజుగారి వేటకై 15 లక్షల రూప్యములను వెచ్చించి ఘనమైనయేర్పాట్లుచేసియున్న గతించిన మహారాజుగారు శ్రీవార్లస్వయముగా నాహ్వానముచేయు భాగ్యములేకున్నను ప్రజలు దుఃఖితులై

యున్నను అవసానకాలమున వేటకై చేయబడినయే ర్పాటుల నిలుపవలదనియు, యథావిధిగ జరుపుమని యు తమకుమారునికి ఆజ్ఞనొసంగియుండిరి. అందున తండ్రిగారియాజ్ఞను ఉల్లంఘనచేయకూడదని కుమా రుడు శ్రీజార్జిరాజుగారిని రమ్మని బ్రతిమాలుచు వర్త మానమంపిరి. శ్రీచక్రవర్తిగారు వారివిన్నపమునంగీ కరించి, నేపాలదేశమునకుపోయి అక్కడవేటాడుచు కొన్ని రోజులుండిరి. ఆవేటయందు శ్రీవారు 18 పెద్దపులులను 3 ఖడ్గమృగములను అనేక దుప్పులు, కణుజులు, పందులు మొదలగువానిని సాహరించిరి. వేటతదనంతరము శ్రీవారు కలకత్తా నగరమునకు బయలుదేరి 30 తేదిన కలకత్తాచేరిరి. శ్రీమేరీ మహారాణిగారును కలకత్తాచేరిరి. 1912 సంవ త్సరము జనవరి 1 తేదిన శ్రీరాజదంపతులు గుఱ్ఱపు పందెములు పోలో ఆటలు వీక్షించిరి. నాటిరోజు ఉదయమున శ్రీవారు సైన్యముల పరీక్షించిరి. ఆసేనల పరీక్షించు మైదానమునకు గొప్ప పరివార ముతో తానుపోవుసమయమున తన్నుచూచుటకై ప్రజలు గుంపులుగావచ్చుచుండ పోలీసువాడొకడు

కర్రతో ప్రజలకొట్టుచుండుటను శ్రీజార్జిచక్రవర్తి గారు స్వయముగాజూచి యాపోలీసువానిని మందలించి గుఱ్ఱమును నెమ్మదిగా ప్రజలవద్దకు పోనిచ్చి, వారికి దర్శనమిచ్చి సంతుష్టులంజేసి తమ సహజ ప్రేమాతిశయమును గనబరచిరి. మరుసటిదినము హార్డింజిప్రభువుగారు తమ బంగళాయందు గొప్ప విందు జేసిరి. శ్రీరాజుగారు అచ్చట సమావేశమైన ప్రముఖులతో కలసిమెలసి సంభాషించి తమ దయారసమును గనబరచిరి. నాటిరాత్రి శ్రీరాజుగారు 'లెవి' (సభ) గావించి సుమారు వేయిమంది ఆంగ్లేయ హైందవప్రముఖులకు దర్శనమిచ్చి వారి రాజభక్తి నంగీకరించిరి. శ్రీరాజుగారు కలకత్తా నగరమున నిర్భయముగ పరివారములేకనే తిరుగుచుండుట అనేకులకు ఆశ్చర్యమును కొందరికి భయమును కలుగజేసెను. శ్రీవార్లకేమి అపాయము జరుగునోయని కొందరు అనుమానాస్పదులైయుండిరి. కాని శ్రీవారు నిర్లక్ష్యముగ సందులుగొందులు తిరుగుచు ప్రజలతో సంభాషించుచు వారి శుభాశుభముల విచారించుచు జనసామాన్యముయొక్క

జీవితముల స్వయముగ గమనించుచు తమ సుగుణ పుంజమును ప్రకటింపజేసిరి. జనవరి మూడవ తేదిన కలకత్తా మైదానములో జరిగిన బాణాసంచులవేడుకలను, దివిటీయుత్సవములను జూచిరి. నాల్గవ తేదిన శ్రీమేరీ మహారాణిగారు గుఱ్ఱపుపందెములలో జయమందినవారికి బహుమతుల నొసంగిరి. ఆవల శ్రీవార్లు ఆంగ్లేయుల క్లబ్బును దర్శించి, అక్కడనుండి వివిధ వస్తుప్రదర్శనశాలంజూచుటకు వెళ్లిరి. తర్వాత శ్రీవిక్టోరియా మహారాణిగారి జ్ఞాపకార్థమై కట్టబడుచున్న సుందరభవనమును దర్శించి మోటారుబండిలో గవర్నమెంటు హౌసుకుబోయిరి. జనవరినెల 5 తేదిన శ్రీరాజదంపతులు పరివార సహితముగ బండినెక్కి పురవీథులమధ్య నెమ్మదిగా బండినిపోనిచ్చి వీథులనిండియున్న ప్రజలకు దర్శనమిచ్చిరి. జనవరి 6 తేది కలకత్తా యూనివర్సిటీవారు సభచేసి శ్రీవార్లకు విజ్ఞాపనపత్రికను సమర్పించిరి. అందుకు ప్రత్యుత్తరమిచ్చుచు శ్రీజార్జిచక్రవర్తిగారిట్లునుడివిరి. "దేశమునందంతటను అనేక పాఠశాలలును కళాశాలలును నెలకొల్పబడి రాజభక్తియు,

నాత్మగౌరవమును గలిగి ప్రయోజనకారులగుజనులు బయలువెడలి పరిశ్రమలయందును, వ్యవసాయము నందును, ఇంకను ఇతరవృత్తులయందును, బ్రవేశించి కీర్తి తేవలయునని కోరుచున్నాను. హిందూదేశము లోని నాప్రజలకుటుంబములు ప్రకాశవంతములై విద్యాప్రచారమువలన వారి ప్రయత్నములన్నియు సుఖప్రదములై వివేకమును, ఆరోగ్యమును, సౌఖ్య మును, వృద్ధిజెందుగాకయని కోరుచున్నాను. విద్య వలననే నాయాశయము నెరవేరును. హిందూదేశీ యుల విద్యాభివృద్ధినే సదా నేగోరుచుండెదను" అని నుడివిరి. నాటిదినము మైదానములో ఇదివరకిటీవల నెన్నడునుజరిగియుండని ఘనమైన వేడుకలు జరిగెను. శ్రీ రాజదంపతు లున్నతసింహాసనాసీనులై యుండి, మొగలాయి చక్రవర్తులకాలములో జరుగు నౌరోజు పండుగయు, హిందూచక్రవర్తులకాలములో జరుగు దశారాపండుగయు నేవిధముగ జరుపబడుచుండెనో దానినిసూచించుచు ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱములు, పల్లకీలు, వేషములు, మేళములుమున్నగుసమస్తవస్తు చయముతో నూరేగింపు ముందు బయలుదేరెను.

ఈ వేడుకలజూచుటకై భరతఖండముయొక్క నలు దిశలనుండి జనులు సమావేశమైయుండిరి. ఉత్సవముల నేర్పాటు చేయుటకై లక్షలకొలంది ధనము వ్యయముచేయబడెను. మరియు నిట్టియుత్సవముల నేర్పాటుచేయుటయందు పండితులగులా సెలస్‌దొర వారు సీమనుండిరప్పింపబడిరి. వారే ఈయుత్సవముల నతిశ్లాఘనీయముగ నేర్పాటుచేసిరి. ఈఉత్సవానంతరము ఒరిస్సాకోయవారు వారిదేశపు నృత్యమును చేసి శ్రీవార్లకు సంతోషముకలుగజేసిరి. శ్రీవార్లు జనవరి నెల 8 తేది వంగదేశ శాసననిర్మాణసభవారి విన్నపపత్రికనందిజవాబిచ్చి, నాటిదినమే సపరివారముగ కలకత్తానగరమునువిడచి బొంబాయికి పయనమైరి. శ్రీవారుమధ్య నాగపురమున మూడుగంటలు నిలిచి, పట్టణమునంతయుజూచి జనవరి నెల 10 తేదిన బొంబాయిచేరి బొంబాయి శాసననిర్మాణ సభవారి విన్నపపత్రికంగైకొనిరి. శ్రీరాజదంపతులు హిందూదేశయాత్రను సంపూర్ణముగావించి మాతృదేశమునకుపయనమగు అంత్యస్థానము గాన నత్తరి భారతీయులపట్ల తమకృతజ్ఞతను తెలుపుచు నిట్లు ప్రసం

గించిరి. "హిందూదేశములోని భక్తివిశ్వాసములు గలనాప్రజలను తిరిగిచూచుభాగ్యముకలిగినందులకు నాకధిక సంతోషము కలుగుచున్నది. మాయెడల గనపరుపబడిన యథార్థానురాగమును, భక్తియు, చక్రవర్తినియొక్కయు, నాయొక్కయు హృదయముల గట్టిగానాటినవి. కాని యీ దేశమునమేము మరికొంతకాలముండి పురాతనప్రసిద్ధమగుచెన్నరాజధానినేమి మాకు ప్రీతితో నాతిథ్యమొసగిన ననేక సంస్థానాధిపతులరాష్ట్రములనేమి చూడలేకపోతిమి కదాయను విచారముమాత్రము బాధించుచున్నది. మేమిచ్చటనుండినకాలమున మాకుజూపబడిన యాదరణమును గాని, భక్తిశ్రద్ధలనుగాని, యెన్నటికిని మరువజాలము. మా యీ సందర్శనము ఈ మహాఖండములోని ప్రజలకు శ్రేయోదాయక మగుగాక యని భగవంతుని వేడెదము. నా రాజ్యమునందలి యితరభాగములలోని ప్రజలనెట్లుచూచుచున్నానో అట్లే మీకుక్షేమమొనగూర్చుట కెప్పుడును ప్రయత్నించెద. అన్నిజాతులవారును, మతములవారును గలసి యేకమనస్కులై యొసంగిన యాతిథ్యమునకు

నెంతయు సంతసించు చున్నాను. ఇకముందును నీ విధముననే సర్వవిషయములందును నడుచుకొనుట సాధ్యముకాదా? మీరాకవలన నిది నెరవేరినచో, ధన్యులమయ్యెదము. మేము ప్రథమమునవచ్చినప్పుడు, తిరిగి వెడలిపోవునపుడును సత్కరించినబొంబాయి వాసులకగుమీకు నా యాప్రేమాస్పదమగు సంతృ సందేశమునుదెల్పుచున్నాను" శ్రీరాజదంపతులా దినమే హిందూదేశమునువదలకపూర్వము ప్రధాన మంత్రియగు ఆస్క్విత్ దొరవారికి తమహిందూదేశ సందర్శనము జయప్రదముగజరిగెననియు, ఢిల్లీ, కలకత్తా, బొంబాయినగరములలోనేగాక, హిందూ దేశ మందంతయు ననిర్వచనీయమగు రాజభక్తిని భారతీయులువెల్లడిపరచిరనియు తంతివార్తనంపిరి. నాటి సాయంకాలము ఆరుగంటలకు శ్రీపంచమజార్జిచక్రవర్తియు శ్రీమేరీచక్రవర్తినియు, సుఖప్రయాణమునకై రేవువద్ద గుమికూడిన ప్రజలదీవనలనంది జయజయ ధ్వనుల మధ్య, మెడీనా పొగయోడనెక్కి మాతృదేశమునకు పయనమైరి.

---

# పదునారవ అధ్యాయము



మాతృభూమిఁ జేరి

సుఖముగ పాలించుట

శ్రీరాజ దంపతులు బొంబాయి నగరమువదలి జనవరినెల 17 తేదిన పోర్టుసూడాౝ చేరిరి. అక్కడ కిచనర్ ప్రభువును సర్ రైనాల్డు విల్లింగేట్ అను వారును శ్రీవార్ల నెదుర్కొని స్వాగత మొసంగిరి. అక్కడనుండిబయలుదేరి 20-వ తేదిన పోర్టుసెడ్ చేరిరి. ఈజిప్టురాజుగారు శ్రీరాజదంపతులందర్శించి అచ్చటనే నాటిదినము విందారగించిరి. 24-వ తేది మెడీనా యోడ మాల్టాద్వీపము జేరెను. అక్కడ యుద్ధనావలు శ్రీవారలనెదుర్కొని గౌరవించెను. మాల్టాబయలుదేరి జిబ్రాల్టరుమీదుగా శ్రీరాజ దంపతులు ఫిబ్రవరినెల 4 తేది స్పితెడ్ రేవుచేరిరి. రేవువద్ద నావలన్నియు మిక్కిలి శృంగారింపబడిశ్రీ వార్లకు స్వాగత మొసంగెను. శ్రీ అలెగ్జాండ్రా మహారాణిగారును యువరాజుగారును మేరీరాకు

మారికయు కానాటు రాకుమారుడును శ్రీ రాజ దంపతుల నెదుర్కొనుటకై వచ్చి రేవువద్ద కాచి యుండిరి. మెడీనాపోగ యోడ రేవుచేరగానే రాజ కుటుంబమువారు శ్రీవార్ల యోడలోనికి వెళ్లి నాటికి సుమారు మూడునెలల క్రిందటజూచిన యారాజ దంపతుల నాలింగనముచేసికొని కుశలప్రశ్న లడిగి వారినెంతయు గౌరవించిరి. ఆ దినమే బయలుదేరి శ్రీరాజదంపతులుపోర్టుమత్ రేవు చేరిరి. పోర్టుమత్ పౌరులు శ్రీవార్ల సుఖాగమనమునకు సంతోషించుచు విన్నపపత్రికనర్పించుకొనిరి. దానినంగీకరించి శ్రీరాజుగారు తగిన ప్రత్యుత్తర మొసంగి తమప్రయాణమే రేవున ప్రారంభమయ్యెనో అచ్చటనే అంత్యమగుట యెంతయు సమంజసముగ నున్నదనియు హిందూదేశీయులు తమకు జూపినభక్తికిని ప్రేమకును మిక్కిలిసంతోషమొందితిమనియు, వచించిరి. అక్కడనుండి శ్రీరాజదంపతులు లండను నగరమునకు పయనమైరి. శ్రీవార్లు లండనుచేరుదివసమున చలిమిక్కిలి యుపద్రవముగా నున్నప్పటికిని, విక్టోరియాస్టేషనువద్ద వేనవేలు ప్రజలును మంత్రిసత్త

ములును పార్లమెంటు సభ్యులును గుంపులు గుంపులుగా సమావేశమైయుండిరి. శ్రీవారు రైలు దిగి పైనచెప్పబడిన జనసమూహమంతయు వెంట నంటిరా, ఉత్సవముతో లండనుపుర వీధులలో నూరేగి చలివిశేషముగానున్నను తమదర్శనమునకై పురవీధుల క్రిక్కిరిసియున్న ప్రజలకు కనబడునట్లుగా శ్రీవారిబండి పైమూతలుతీయించి, ప్రజలసంతోషమున కచ్చెరువందుచు బకింగ్ హాము రాజనగరు జేరిరి. మరుసటిరోజు శ్రీరాజ దంపతులు తాము క్షేమముగ స్వగృహముచేరినందులకు దైవప్రార్థన జేయ శెంట్ పాల్సు కెతిడ్రల్ కుపోయిరి. ఫిబ్రవరి 10 తేదిన శిటీకార్పొరేషన్ వారును కౌంటికౌన్సిలు వారును శ్రీవార్లకు విజ్ఞాపన పత్రికల నొసంగిరి. అందులకు హిందూ దేశీయుల స్వచ్ఛందమైన రాజభక్తిని ప్రేమయును అనేకవిధముల బాగుగ గమనించితిమనియు బ్రిటిష్ పరిపాలనమందును బ్రిటిష్ రాజునందును వారికివిశ్వాసముకలదనియు ఆంగ్లేయ ప్రజలును వారియందు స్నేహమును దయయును చూపవలయుననియు అభిప్రాయమిచ్చు వాక్యముల

జవాబిచ్చిరి. తర్వాత మూడు రోజులకే శ్రీచక్రవర్తిగారు మదరాసుగవర్నరుపదవికి మంచి ప్రభువుగావెతకి లార్డు పెంట్లండుగారిని నేమించిరి. ఫిబ్రవరినెల 14 తేదిన పార్లమెంటుసభను ప్రారంభించుటకై శ్రీరాజదంపతులుబకింగ్ హామ్ భవనమునుండి వెష్టుమిన్‌స్టరు హాలునకుపోయిరి. శ్రీరాజుగారు సింహాసనమునుండి గొప్ప ఉపన్యాసమిచ్చి అందులో హిందూదేశమును గురించియు, భారతీయుల రాజభక్తింగూర్చియు మెచ్చుకొనుచు వచించిరి. మార్చినెలలో శ్రీవారు కొన్ని 'లెవీ' జరిపియు, సేనల పరీక్షించియు కొంతకాలము గడిపిరి ఏప్రెల్ నెల 15 తేదిన టిటానిక్ అను పొగయోడ మునిగిపోయి సుమారు 1500 మంది జనులు నశించగా, శ్రీరాజదంపతులు మిక్కిలి దుఃఖించి, తక్షణమే వారి దుఃఖమును తెలుపుచు, చనిపోయిన వారి కుటుంబీకులకును, ఓడ కంపెనీవారికిని తంతి వార్తనంపిరి; మరియు ద్రవ్యమొసంగి చనిపోయిన వారలలో బీదవారికుటుంబములకు సహాయపడిరి. శ్రీరాజుగారు మేనెల 7 తేదిన లండను బయలుదేరి

వేనుత్ బే వద్దనుండిన యుద్ధనావలను బరీక్షించిరి. అచ్చట మూడు రోజులుండి యోడల వేడుకలం జూచివచ్చిరి. జూన్ నెల 3 తేదిన శ్రీరాజుగారి జన్మ దినమహోత్సవము బకింగ్ హామ్ భవనమున ఘనముగా జరుపబడెను. ఆనెల 22 తేదిన వింజరు నందు శ్రీరాజుగారు 14,000 సేనల పరీక్షించిరి. ఆదినమే శ్రీవారి జ్యేష్ఠకుమారుని 18 వ జన్మదివసము వైభవముగ జరుపబడెను. ఆనెల 25 తేది శ్రీవారు కార్డిఫ్ పట్టణమునకు వెళ్లి మరల 28 తేది లండనుపురి జేరిరి. జూలై 8 తేదిన లార్డు విల్లివిలియం గారి అతిథులుగా వెంట్ వర్తుహౌసుకుపోయి వారి ఆతిథ్యము నందిరి. మరునటిదినము షెఫ్ఫీల్డు నద్ద జరిగిన గనుల అపాయములో అనేకజనులు చని పోయినందువలన శ్రీవారచ్చటికి వెళ్లి తమసాను భూతిం దెలిపిరి. ఆగస్టు 12 తేదిన డివన్ షైరు ప్రభువు గారిని చూచుటకై శ్రీరాజుగారు లండనుబయలుదేరి బోల్టన్ అబీకిపోయిరి. అక్కడ వారమురోజులుండి సెప్టన్ ప్రభువును చూచుటకై అబీస్లీన్ కుపోయిరి. తర్వాత లాంకాస్టరుద్వారా బాల్మోరాలుకుపోయి

స్వగృహముచేరిరి. డిసంబరునెల 12-వ తేదిన శ్రీచక్ర వర్తిగారి పట్టాభిషేక ప్రథమ సంవత్సరోత్సవ దివసమున హిందూదేశీయులకు కుశల వర్తమానము నంపుచు తంతివార్త జేసిరి. ఆనెల 21 తేదిన అప్పుడు యూరోపుఖండములో జరుగుచున్న యుద్ధములలో రాజీకుదుర్చుటకువచ్చియున్న ప్రతినిధులకు బకింగ్ హామ్ భవనమున స్వాగతమిచ్చి గౌరవించిరి. 1913 సంవత్సరము ఫిబ్రవరి 5-వ తేదిన శ్రీజార్జిరాజుగారు న్యూజీలాండు అను స్టీమరును పరీక్షించుటకై వెళ్లిరి. మేనెల 19 తేది శ్రీరాజదంపతులు పరివార సమేతముగ బెర్లిన్‌పట్టణములో ప్రిన్సెస్ విక్టోరియా లూసీగారియొక్కయు కంబర్లెండు ప్రభువగు అర్నెస్టుగారియొక్కయు వివాహ మహోత్సవమును దర్శించుటకై వెళ్లిరి. అక్కడ శ్రీవార్లు 21-వ తేదిన చేరిరి. 23 తేదిన బెర్లినులోనుండు ఆంగ్లేయజనుల ప్రతినిధులు శ్రీవార్లందర్శించి స్వాగతమొసంగిరి. 24 తేదిన శ్రీవార్లు చూడవెళ్లిన వివాహకార్యము యథావిధిగా జరిగెను. అంతట 28 తేదికి శ్రీవార్లు లండనునగరముచేరిరి. జూన్ నెల 7 తేదిన యుద్ధము

లలో మునిగియున్న బాల్కాను రాష్ట్రముయొక్క ప్రతినిధులు శ్రీవారినిదర్శించగా, శ్రీ రా జు గా రు వారిని మిక్కిలి గౌరవించి ఇంకను పోరాటములచే ధనవ్యయమును ప్రాణనష్టమును జేయుట మంచిది కాదనియు రాజీపడమనియు సలహా నిచ్చిపంపిరి. అవసరమైనపుడెల్ల వివిధ శాఖలవారగు మంత్రి సత్తములు శ్రీరాజుగారిం దర్శించి వారి యభిప్రాయములను సలహాలును పొందుచుందురు. ఈవిధముగా తాను స్వకీయముగా చూడదగిన విషయములను మాత్రము విచారించుచు, తక్కినవానిని మంత్రిసత్తముల న్యాయబుద్ధికి నొప్పగించి, లోపములు జరుగకుండ గమనించుచు, శ్రీజార్జిచక్రవర్తిగారు ఆంగ్లేయ రాజ్యాంగ యంత్రమును నడపుచున్నారు.



# పదునేడవ అధ్యాయము



గుణగణములు; కుటుంబము

శ్రీజార్జి చక్రవర్తిగారియొక్క గుణములంగూర్చి విశేషము వ్రాయ నక్కరలేదు. ఈచరిత్రము నింత వరకు చదివిన వారిసద్గుణములు తేట తెల్లమగు చున్నవి. శిడ్నే బ్రూక్సు అను అమెరికా దేశీయు డిట్లు చెప్పెను. "జార్జి రాజుగారికి నౌకావిద్యవలన పట్టుబడిన గుణములలో ముఖ్యమైనది తన విధ్యుక్త ధర్మమందు మితిమీరినపట్టుదల. ఇపుడు సజీవులై యుండు మహనీయులలో న్యాయతమమైన వర్తనము గలవారలలో జార్జిరాజొకరు". వారితోగూడ నిరంతరము విశేషకాలముండిన స్నేహితుడొకడు "తన ధర్మమును నెరవేర్చుటకై రాజుగారు ఏపనినైనను ఆపివేసి ముందుతనవిధాయకకృత్యముల నొనర్చును" అనియు మరియొక పర్యాయము "నే ననేకమందివద్ద నౌకరిచేసియున్నాను గాని త్వరలో జార్జిరాజునొద్దనే కొలువుచేయ నిష్టపడుచున్నాను" అనియుం జెప్పె.

ఇదే విధముగ శ్రీచక్రవర్తిగారివద్ద కొలువుండిన అనేకులు చెప్పియున్నారని చరిత్రకారులు వ్రాసియున్నారు. ఇంతేల! విశేష ప్రయాసలకోర్చి, ఆరు వేలమైళ్లు సముద్రయాన మొనర్చి, స్వకీయముగా తాను భరతఖండమునకు వెళ్లి ఢిల్లీనగరమున పట్టాభిషిక్తులుగావలెనని కృతనిశ్చయులగుటయే శ్రీజార్జి చక్రవర్తిగారి ధర్మనియతికి ప్రబలనిదర్శనము. మరియు శ్రీచక్రవర్తిగారు డంబముగాని గర్వముగాని యెరుగరనుటకును భరతఖండమందలి శ్రీవారి నడవడికయే సాక్షి. శ్రీవారు సాధారణ జనులవలెనే వర్తించుచు, తన రాజగౌరవమునకు ముఖ్యముగ కావలసినపరివారము మాత్రముంచుకొని, ప్రజలతో కలసిమెలసి వర్తించుచుందురు. ఎల్లమానవులయందును సనుబుద్ధియు, దాక్షిణ్యమునుగలిగివర్తించుచు పరోపకారపారీణతయందు దీక్షగలిగి లోకులకు తామెన్నివిధముల సాయపడగలరో యట్లు చేయుచు కాలము గడపుచుందురు. బాల్యమునుండియు దేశదేశములు సంచారము చేసియుండుటవలన శ్రీజార్జిరాజుగారివలె దేశములు తిరిగిన రాజే లేడని లోక

ప్రతీతి. మరియు నాకారణముననే వారిని 'శైలర్ కింగ్' అని సహా చెప్పుదురు. శ్రీవారి బాల్యమునుండియు వారినిగుర్తెరిగిన రోస్‌బరీదొరవారు శ్రీవారింగూర్చి యిట్లు చెప్పిరి. "వారు పవిత్రమైనట్టియు, ఆరోగ్యకరమైనట్టియు, మితాహారియని చెప్పదగినట్టియు, జీవితముగలవారు; మరియు సద్గుణములుగలభర్తయు తండ్రియు కాన ఈ దేశమునకు ప్రియమైన యీసద్గుణములనే పరిపాలనయందును ఆయన కనబరచును." ఇంకొక ప్రముఖుఁడు "శ్రీవారిమర్యాద స్వభావమునకును,కనికరమునకును నేనుసాక్షి "అని చెప్పియున్నాఁడు. ఇట్లు వేనవేలు యోగ్యతాపత్రములను వివిధదేశజులవలన బొందియున్న శ్రీపంచమజార్జి చక్రవర్తియొక్క గుణములగురించి విశేషము ప్రసంగించుట అనావశ్యకము.

శ్రీమేరీ మహారాణిగారియొక్క గుణముల గురించియు నంతియే. ఆమెగారి సంతోషస్వభావము, స్వచ్ఛందమానసము, దీనజనాదరణము, వీనికిమహారాణిగా రెంతయో ప్రసిద్ధిజెందియున్నది. వివాహకాలమున నామెగారి సద్గుణములయందు శ్రీవిక్టో

రియా మహారాణిగారి కెట్టి నమ్మకముండెనో, ఆ నమ్మకమును శ్రీమేరీ మహారాణి స్వకీయవర్తనము వలన ఋజువుచేసి, ఆంగ్లేయప్రజల సంపూర్ణానురాగమునకు పాత్రురాలయ్యెను. శ్రీమహారాణిగారికి ఆంగ్లేయ, ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్ భాషలలో మంచి పాండిత్యముగలదు. శ్రీవారెప్పుడును గ్రంథముల చదువుటయం దత్యంతప్రేమగలిగియుందురు. గృహకార్యములన్నియు స్వయముగా విచారించుకొనుచు తత్సంబంధమగు లెక్కలన్నియు స్వయముగా పరీక్షించుచుందురు.

ఈ రాజదంపతులకు అయిదుగురు కుమారులును ఒక కుమార్తెయు గలరు. ప్రథమపుత్రుడగు మన యువరాజుగారు 1894 వ సంవత్సరము జూన్ నెల 23-వ తేదిన జన్మించిరి. రెండవ కుమారుడు ప్రిన్సు ఆల్బర్టు ఫ్రెడరిక్ ఆర్థరుగారు 1895 సంవత్సరము డిసంబరు 14 తేదినను, ప్రథమ కుమార్తెయగు ప్రిన్సెస్ విక్టోరియా అలెగ్జాండ్రా అలైస్ మేరీగారు 1897 సంవత్సరం ఏప్రెల్ నెల 23 తేదినను, మూడవ కుమారుడు ప్రిన్సు హెన్రీ విలియమ్‌గారు 1900 సం॥

మార్చి నెల 31 తేదియందును, నాల్గవ కుమారుడు ప్రిన్సుజార్జి ఎడ్వర్డుగారు 1902 సంవత్సరము డిసంబరు 20 తేదియందును ఐదవకుమారుడగు ప్రిన్సుజాన్ గారు 1905 సంవత్సరం జూలై నెల 12 వ తేదియందును జననమొందిరి. ఈ పుత్రపుత్రికలనందరిని శ్రీ మేరీ మహారాణిగారు మిక్కిలి శ్రద్ధతో విచారించుకొనుచు, వారికి సత్ప్రవర్తనయు, సద్బుద్ధులును నేర్పుచు, దాదులయందే సకలభారములను వైవక స్వయముగ చూచుకొనుచుందురు.

ఈ రాజదంపతులిరువురు మిక్కిలి దైవభక్తిగలవారు. ప్రతిదినము బైబిలుగ్రంథమును చదువుదురు.

భారతీయులందును శ్రీరాజదంపతులు అన్యదేశజులయందువలెనే మిక్కిలి ప్రేమయు కనికరమును గలవారని పైనపెక్కు నిదర్శనముల పేర్కొంటిమి. మరియు ఈరాజదంపతులే భారతీయులజూడ స్వయముగా రెండుపర్యాయము లీవిశాల క్షేత్రమును దర్శించినవారు గావున భారతీయులెల్లరు శ్రీవార్లకు మిక్కిలి కృతజ్ఞులైయున్నారు.

శ్రీపంచమజార్జి చక్రవర్తియు శ్రీమేరీ చక్రవర్తినియు దీర్ఘాయుష్మంతులై, అభ్యుదయ పరంపరాభివృద్ధిగలిగి, చిరకాలము హిందూదేశమును, ఇతర ఆంగ్లేయ రాష్ట్రములను ఇంకను ప్రజానురంజకముగ పరిపాలింప ఈశ్వరు డనుగ్రహించుగాక !




Printed at the Sreenikathanum Press. Madras.

# ప్రకటన.

---

సుబోధినీ గ్రంథమాల,

నెల్లూరు.

ఇందు సర్వజనుల కుపయోగపడునట్టివియు, కించిద్భాషా జ్ఞానముగల స్త్రీపురుషులేని సులభముగా గ్రహించుట కనువగు శైలిలో నుండునట్టివియు, నగు, సుప్రసిద్ధ మహాపురుషుల జీవితచరిత్రములు వారిబోధనలు, నాటకములు, నవలలు, ముఖ్యముగ మన భరతఖండమునకు సంబంధించిన రాజకీయ సాంఘిక, పరిశ్రామిక మతవిషయములంగూర్చిన పొత్తములు, ప్రచురింపబడును. రెండేసి నెలలకు నూరుపుటలకు పైగాగల సంపూర్ణ గ్రంథమొక్కొకటి వెలువడును. చందాదారులు రూ. 0-12-0 లు, సహాయులు రూ. 2 0-0 లు, పోషకులు రూ. 5-0-0 లు, ప్రధానపోషకులు రూ. 10-0-0 లు ప్రతి అర్ధసంవత్సరమున కొకపర్యాయము చెల్లించవలయును. ప్రతి ఆరునెలలకు

రూ. 10-0-0 ల కంటె నధికముగ విరాళ మొసగు వారు రాజపోషకులుగ పరిగణింపబడుదురు. చందా ద్రవ్యము ముందుగానే ఆయా అర్ధ సంవత్సరము లోని ప్రథమ గ్రంథముతోటి రాబట్టుకొనబడును. పోస్టుఖర్చులు మున్నగునవి మేమే భరించెదము. రాజపోషకులు, ప్రధానపోషకులు, పోషకులు, సహాయులు అగువారలపేర్లను ప్రతి గ్రంథమందున బ్రచురించి దళసరి కాగితములుకలిగి కాలికో బైండు చేయబడిన గ్రంథములను వారికి సమర్పించుకొని మా కృతజ్ఞతను తెలుపుకొందుము. ఈ గ్రంథమాల యందు జ్ఞానబోధకంబులగు చిన్నగ్రంథము లనేకములు ప్రచురింపదలచితిమి. కావున భాషాభిమానులు, గ్రంథములు వ్రాసి ఇచ్చియు, చందాదారులుగ చేరియు, చేర్పించియు, తోచినరీతిని సహాయము చేయ మిక్కిలి ప్రార్థితులు.

ఇట్లు
ప్రకాశకులు

(ఈప్రక్క పేర్కొనబడినవారు మా సుబోధినీ గ్రంథమాలయందు ఉన్నతతరగతి చందాదారులుగా చేరినందుకు వారికి మే మెంతయు కృతజ్ఞులము:—ప్రకాశకులు.)

# సుబోధినీ గ్రంథమాల

## ప్రధానపోషకులు.

మహారాజరాజశ్రీ, పెళ్లేటి-పెంచెలు రెడ్డిగారు.

## పోషకులు.

మహారాజరాజశ్రీ, కుండా- చెంచురామి రెడ్డిగారు.

## సహాయులు.

మ-రా-రా-శ్రీ, గురిజాల సుబ్రహ్మణ్యంగారు.
,, కొమాండూరు వేంకటాచార్యులుగారు.
,, పెజ్జాయి రాఘవరెడ్డిగారు.
,, నేణుంబాక రామకృష్ణారెడ్డిగారు.
,, పశ్చిశెట్టి శేతు మాధవయ్య శెట్టిగారు
,, అల్లంపాటి చెంచురామిరెడ్డిగారు.
,, కొటంరెడ్డి చిన్న రామచంద్రారెడ్డిగారు.
,, రాయియల్ల మందయ్యగారు.
,, బండి చెంచురామిరెడ్డిగారు.
,, కలికి రామచంద్రారెడ్డిగారు.
,, మల్లవరపు రామారావుగారు.
,, అంబటు గురుమూర్తిగారు.
,, జరుగుమల్లి పెంచలురెడ్డిగారు.
,, పాదెర్ల రామలింగారెడ్డిగారు.
,, రాచర్ల కృష్ణమ్మనాయుడుగారు.

| | | | |
|---|---|---|---|
| సులభవ్యాకరణము (ప్రథమభాగము) | 0 | 8 | 0 |
| డిటో (ద్వితీయభాగము) | 0 | 9 | 0 |
| డిటో (తృతీయభాగము) | 0 | 6 | 0 |
| శ్రీరామచంద్ర లీలాతరంగిణి (అయోధ్యాకాండము) | 0 | 3 | 0 |
| న్యాయమూర్తి శర్. శి. శంకరనాయరుగారి సంఘసంస్కరణోపన్యాసము | 1 | 0 | 0 |
| శకుంతల చరిత్రము | 0 | 3 | 0 |
| హరిశ్చంద్ర చరిత్రము | 0 | 2 | 0 |
| ఆర్యకథానిధి ప్రథమభాగము | 0 | 2 | 0 |
| డిటో రెండవభాగము | 0 | 2 | 6 |
| కళావతి (నవల) | 0 | 12 | 0 |

☞ మావద్ద పై గ్రంథములును ఇంకా మరికొన్ని గ్రంథములును విక్రయింపబడును. వలయువారీ క్రింది చిరునామాకు వ్రాయవలెను.

మేనేజరు,

యం. ఆర్. కృష్ణరావు అండు కంపెనీ,

నెల్లూరు.